దర్శనాచార్య

# శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర




రచయిత

ఆలంపురి బ్రహ్మానందం వెలిమల

M. A, B. Ed,



విశ్వకర్మ ప్రచురణ

1993

దర్శనాచార్య

# శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర





రచయిత

ఆలంపురి బ్రహ్మానందం వెలిమల
M. A , B. Ed.

విశ్వకర్మ సాహిత్య రత్న, ఆంధ్ర కవితావిశారద

1993

Darshanacharya Sri Konduru
Sahitya Jeevitha Charitra

by Alampuri Brahmanandam



విశ్వకర్మ ప్రచురణము
ప్రథమ ముద్రణము

వెల : రూ. 20.00

ప్రతులకు

1) ఆలంపురి బ్రహ్మానందం
14-2-334 జ్ఞాన్‌భాగ్,
హైద్రాబాద్-500 012.

2) ఇంటి నెం. 3-151, గౌతమ్‌నగర్ కాలనీ
పొటంచెరువు-జిల్లా మెదక్-502 319
ఆంధ్రప్రదేశ్.

ముద్రణ : మాధవీ ప్రింటర్స్
3-3-869 కుత్బిగూడ
హైద్రాబాద్-500 027.

# అంకితం



పితృపాదులు

అచలాత్మభావసంపన్నులు

**ఆలంపురి నాగాచార్యులు**

వేదవేదాంత విజ్ఞాన విదులు తత్త్వ
చర్చ లొనరించునపుడు తత్సారమైన
అచల తత్త్వార్థ "నాసదీయా"ఖ్యబుక్కు-
భావమును దెల్పు తండ్రికి భక్తి నిడితి.

గ్రంథకర్త

అభిప్రాయ వేదిక :

# క్రొత్త వెలుంగు

"సాహిత్యబ్రహ్మ" డా॥ వి.వి.యల్. నరసింహారావు
రిటైర్డ్ డైరెక్టర్, ఆం.ప్ర. ప్రభుత్వ విద్యాశాఖ

"విశ్వకర్మసాహిత్యరత్న" "ఆంధ్రకవితా విశారద" బిరుదాంచితులైన శ్రీ ఆలంపురి బ్రహ్మానందకవిగారు సరిక్రొత్తగా రచించిన గ్రంథము "దర్శనాచార్య - శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర". కవిగారు జీవిత చరిత్ర రచనలో చేయి తిరిగిన ప్రోఢ. శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర జీవితము, శ్రీ పోకూరి కాశీపత్యావధాని శేఖరుల జీవితము, "విమర్శకరత్న" శ్రీ త్రిపురనేని సుబ్బారావు జీవితము పద్యకృతులుగా రచించి ప్రాజ్ఞుల మన్ననలందుకొన్న ప్రతిభాశాలి శ్రీ బ్రహ్మానందకవి. మంచి రచయితకు మంచి విషయము కావ్యవస్తువుగా లభించుటయు ఒక విశేషముగదా! అట్టి విశిష్ట సన్నివేశము బ్రహ్మానందకవికి ఇప్పుడు తటస్థ పడినది. పట్టినది బంగారముగుటకాదు; బంగారమును పట్టుకొనగా అది భాసుర మణిస్థగిత భూషణమై వెలుగు చిమ్మినది. ఆ వెలుగు వెల్లువలో ఆనందముతో అవగాహన మొనర్చుచు నేను వ్రాయుచున్న మాటలివి.

"కళాప్రపూర్ణ"-"దర్శనాచార్య" శ్రీ కొండూరు వీర రాఘవాచార్యుల వారి జీవిత చరిత్రమనగా తెనుగునాట వెల్లివొడిచిన ఆర్ష సాహితీ తేజో నిధానమైన చరిత్ర మన్నమాట; సాధికారముగ వెలసిన వివిధాంధ్ర సాహితీ స్వరూప చరిత్ర మన్నమాట, పరిణతుడైన ఒక ఆత్మయోగి చరిత్ర మన్నమాట. అట్టి చరిత్రమును దక్షతతో రూపొందించిన ప్రజ్ఞ శ్రీ బ్రహ్మానంద కవిగారిది.

రాఘవాచార్యుల జీవితమును కావ్యనిబద్ధమొనర్చిన గౌరవము లోగడ "కవిరత్న" వంగవోలు ఆదిశేషశాస్త్రి, సత్కవి శ్రీ పులివర్తి శరభాచార్యులు, సహజకవి శ్రీగోను గుంట పున్నయ్య గార్లకు దక్కినది. కవిరత్న కలమునుండి వెలువడినది 'అనర్ఘరాఘవ' మై ఆంధ్ర భారతి నలంకరించినది. నేడీ బ్రహ్మానందుల రచన అపూర్వశోభతో అలరారుచు భారతీయ సంస్కృతికిని, సాహితికిని క్రొత్త వెలుగు సంతరించుచున్నది.

శ్రీ రాఘవాచార్యుల జన్మ విశేషము, గీర్వాణభాషాభ్యసనము జాతీయోద్యమాభినివేశము, క్షేత్రసందర్శనము, పీఠాధిపతుల ఆదరాభిమానములు, ఉద్యోగసద్యోగాదులు, శిల్పకళాపరిషత్పోషణ, బిరుదస్వీకారాదులైన అనేక విశేషములను హృదయంగమముగా వివరించినారు బ్రహ్మానందులు.

ఆచార్యులవారి రచనలను గూర్చి సమగ్రముగ వ్రాయుట దుస్సాధ్యమైన పని. అయినను గ్రంథపరిమితిని దృష్టిలోనుంచుకొని బ్రహ్మానందులు ఆచార్యులవారి 'అమరావతి' 'తోరణము' 'మిత్రసాహస్రీత్యాదులగు కావ్యములను, ఆత్మ, శిల్ప, యోగ, సాహితీ దర్శనాదులను, కళాక్షేత్ర వివరణాదిక వ్యాససంపుటులను, అతిలోకమైన వేద రహస్యనిక్షేప సంబంధి గ్రంథజాలమును ఉదాత్త వచన శైలిలో హృదయావర్జకముగ విశదీకరించిరి.

ఆచార్యులవారి గార్హస్థ్యజీవిత విశేషములను కూడ యథావకాశము వివరించి, రాజయోగలక్షణములు గల రాఘవాచార్యులవారి 'ప్రత్యానంద' సంక్షిప్త నామమును సార్థక పరచిరి.

శ్రీ రాఘవాచార్యుల వారు స్వయముగా 'నిరంజనవిజయా' ది జీవిత చరిత్ర రచనలను, "గురుదేవుడు", ఆసియాజ్యోతుల వంటి మహాపురుష జీవితచరిత్ర రచనలను వెలయించిన పుణ్యశీలి. అట్టి ఆచార్యులవారి జీవిత చరిత్రను వెలయించిన పున్నెము శ్రీ బ్రహ్మానంద కవి గారిది.

శ్రీ ఆచార్యులవారి జీవితమును, రచనలను ఆత్మతర్పణముగా రుచి చూచి, అనేక వ్యాసముల రూపములో ఆంధ్రాంగ్ల సహృదయులకు పరిచయము చేసిన పున్నెము నేను కూడ కొంత సమార్జించుకొంటిని. కనుక ప్రస్తుతమైన ఈ జీవిత చరిత్ర గ్రంధమును ఆంధ్ర పఠితృలోకమున కందించిన శ్రీ అలంపురి బ్రహ్మానంద కవిగారిని హార్దికముగా అభినందించుచున్నాను.

హైద్రాబాద్ —వి.వి.యల్. నరసింహారావు
5-10-93

Dr. V.V.L Narasimha Rao
C 4 Huda Colony, Saroornagar,
Hyderabad-500 035

# వీరరాఘవీయం

- కపిలవాయి లింగమూర్తి

శ్రీ విశ్వకర్మ తత్త్వజ్ఞ వేదవేదాంత పారగః
ప్రత్నానంద సమాఖ్యాత, దర్శనాచార్యతే నమః—

కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారు విశ్వబ్రాహ్మణజాతి గర్వించదగిన వ్యక్తి. ఆయన కవి, విమర్శకుడు, చారిత్రికుడు. అన్నిటికి మించి దర్శనాచార్యుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయ బిరుదంతోనేగాక ఆయన పూర్ణిమనాడు జనించిన పురుషుడు కాబట్టి నిజజీవితంలో గూడ కళాప్రపూర్ణుడు. వీర శబ్దానికి శైవులు విజ్ఞానంలో రమించేవాడు అనే అర్థం చెబుతారు. అది వీరి యందు సార్థకమై కనిపిస్తుంది.

విప్రవంశాలలో కొండూరి వారు వెలనాటి వైదికులు. వారిలో కాశ్యప, లౌహిత, శాండిల్య, హరితస అని నాలుగు గోత్రాల వారున్నారు. వీరరాఘవాచార్యుల వారి ప్రతిభా పాండిత్యాలను బట్టి కొందరు వీరిని వెలనాటి వైదికుడని భావింతురు. (చూ:విద్యార్థి కల్పతరువు సం. 2. పు. 893). విశ్వకర్మలలోగూడ ఒకప్పుడీనాడుల భేదాలు లేకపోలేదు. గుంటూరు జిల్లాలోని పులివర్రు సమీపంలో గల అయ్యవారి పాలెంలోని జల్పేశ్వరాలయాన్ని నిర్మించిన శిల్పి కలగరాభరణాచార్యుడు కమ్మనాటియింటి వాడుగా చెప్పబడినాడు కాని ఈనాడుల భేదాలు విశ్వకర్మలలో ఏడవ శతాబ్దంలో అంతరించినవి.

సృష్టికర్తకు సహస్రనామా లెన్ని ఉన్నా "విశ్వకర్మ" అనే పేరు వలె అతనికి మరే నామం సూటిగా సరిపోదు. ఆర్యసమా

జాన్ని స్థాపించిన శ్రీ దయానంద సరస్వతి గారు సృష్టికర్తకు విశ్వ కర్మ అనే పేరునే అంగీకరించినారు. ఈనాడు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ వారు విశ్వకర్మను ఆదికార్మికునిగా మన్నించి అతని జయంతిని గూడ జరుపుతున్నారు కాని శైవులతనిని పంచముఖుడైన శివునిగా, వైష్ణవులు "విశ్వకర్మామనుస్ త్వష్టా, స్థవిష్ఠఃస్థవిరోధ్రువః" అని విష్ణు సహస్రంలో (చూః శ్లో.6) చెప్పబడటం వల్ల నారాయణు నిగా అన్వయిస్తున్నారు తప్ప బహుశఃవిశ్వకర్మను ప్రత్యేక దైవంగా అంగీకరిస్తే అతని వెనుక పంచాననం వారికి ప్రాముఖ్యం కలుగు తుందని కాబోలు అతనిని జగదాదిమ పురుషునిగా అంగీకరించటాని కిష్టపడరు. అట్టివారికి వేదవాఙ్మయంలోని విశ్వకర్మ తత్వాన్ని వెలికితీసి చూపవలసిన అవసరం ఉంది.

ఈ పనిని ఇపుడు శ్రీ వీరరాఘవాచార్యుల వారపరసాయ ణులై తమ ఋగ్వేద యజుర్వేద దిగ్దర్శనాదుల ద్వారా విశ్వ బ్రాహ్మణ మేధావులలో యింతవరకు ఎవరూచేయలేని మహత్కా షిని జాత్యభిమానంతో అంకిత భావంతో సాగించి విశ్వబ్రాహ్మణు లలో జాతీయ కవిగా నిలిచినారు

విశ్వకర్మ వంశీయులలో బ్రహ్మశ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రి గారు విశ్వ బ్రాహ్మణ ప్రశస్తిని, శ్రీ వీరరాఘవాచార్యులు వైదిక వాఙ్మయంలో విశ్వకర్మయొక్క ఉనికిని ఆంధ్రదేశానికి చాటిన కారణ జన్ములనవలె.

నాకు శ్రీ వీరరాఘవాచార్యులతోగల పరిచయం ఈనాటిది కాదు. క్రీ.శ. 1956 నుండి బ్రహ్మశ్రీ కాశీపత్యవధానిగారు పది పన్నెండు సంవత్సరాలు నాగర్ కర్నూలుకు ఏటేట వైశాఖంలో రాసాగినారు. ఆరంభంలో నాకు "బెదురు"ఉన్నా వారు మూడవసారి

నాలవసారి వచ్చేవరకు చనువేర్పడింది. అప్పుడొక పర్యాయం ఆంధ్ర దేశంలో ఉన్న మన పండితులను గురించి ప్రశ్నించినాను. అపుడు వారు శ్రీకొండూరు వీరరాఘవాచార్యుల పేరు, పులివర్తి శరభాచార్యుల పేరు ప్రముఖంగా సూచించి కొండూరువారి "కళారాధన" చెప్పదగిన పుస్తకం అన్నారు. అపుడు నేను వారి చిరునామా నడిగి పరిచయం కొరకు లేఖ వ్రాసినాను. దానితో వారు క్రీ.శ. 1962 ప్రారంభంలో తొలిసారిగా తమకళారాధనను నాకు పంపినారు. అది చదివిన పిమ్మట ఇక అప్పటి నుండి నేను వారి కళను ఆరాధిస్తూనే ఉన్నాను.

నాకు మొదట వారి పేరు వినగానే వారి తలిదండ్రులు తిరువళ్ళూరి వీరరాఘవస్వామి భక్తులు కావచ్చు, లేకుంటే అరుదైన ఆ పేరు తమ కుమారుని కేవిధంగా పెట్టుకుంటారు అనిపించింది. అనంతరం బ్రహ్మశ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రిగారి అనర్ఘరాఘవం చదివిన పిమ్మట నా సందేహం తీరింది.

విష్ణువు పార్వతు లిద్దరు ఏకాంశ సంభూతులు కాబట్టి వారి ద్దరూ అమావాస్యావతప్రియులు. నైమిశారణ్యంలో శ్రీ లలితాదేవి ఉంది. ఇప్పటికీ అక్కడ ప్రతి అమావాస్యనాడు పెద్ద ఉత్సవం వ్రతాలు జరుగుతవి శ్రీ మదాచార్యులవారి జనని పార్వతమ్మగారు మిక్కిలి నిష్ఠతో అమావాస్య వ్రతం చేసేదట ఆ వ్రత ఫలంగా ఆ వీరరాఘవస్వామియె ఈ వీరరాఘవుడుగా అవతరించినాడని బాల సరస్వతి శ్రీ ఆదిశేషశాస్త్రిగారి వాక్కు-అది వృధా ఎట్లవుతుంది ఆయనలో ఆ దైవాంశ లేకుంటే ఈ ప్రతిభ ఎట్లా ఉంటుంది. పాండిత్యమంటె నాలుగు గ్రంథాలు చదివి లేదా నలుగురిని సేవించి ఏలాగో సంపాదించుకోవచ్చు కాని దైవాంశనో లేదా దైవానుగ్రహమో లేకుంటె ప్రతిభ అలవడేది కాదని లాక్షణికులంతా ఏకగ్రీవంగా అంగీకరించిందే కదా!

ఇంతవరకు వీరిపై అనర్ఘరాఘవం, శ్రీ కొండూరు వీరరాఘవాచార్యుల వారి కృతులు సమగ్ర పరిశీలనం, అనే రెండు కృతులు వచ్చినవి. మిత్రులు శ్రీ బ్రహ్మానందంగారి ఈ కృతి మూడవది. ఈనాటి Ph.D.లు వ్యక్తి కృషిని నిల్పగలవేమో గాని ఆయా కవుల వ్యక్తిత్వాన్ని నిలుపలేవు. ఆ పని ఒక్క జీవిత చరిత్రలు మాత్రమే చేయగలవు.

ఈ నాటి యువకులు, నవలా ప్రియులు కానివారు వాని కంటె మహాపురుషుల జీవితచరిత్రలు చదువటం మంచిది.

నవల ఎంత గొప్పదైనా అది కవిగారి ఊహాప్రపంచమే గాని వాస్తవము గాదు. ఒక్కొక్కపుడు దానివెనుక కవిగారి అనుభవాలే వైనా లీలామాత్రంగా చోటుచేసికొన్నా అవి ఎందరికో నిజమనిపించవు కాని జీవిత చరిత్ర ఆ విధంగా కాదు. అది ప్రపంచమనే ప్రయోగశాలలో జరిపిన "ఎక్స్పెరిమెంట్" కాబట్టి పాఠకులు నవల చదివినదానికంటె జీవిత చరిత్రలతో ఎక్కువ పాఠాలు నేర్చుకోగలరు.

జీవిత చరిత్రలో ఆయావ్యక్తులనుభవించిన కష్టసుఖాలు, వాని పర్యవసానాలు యథాతథంగా చిత్రించబడుతుంటవి కాబట్టి తమ జీవితములో అభ్యుదయాన్ని కోరేవారు మహాపురుషుల జీవిత చరిత్రలు అవశ్యం చదువవలసి ఉంది.

ఈనాడు కొందరి జీవిత చరిత్రలు పద్యమయంగా కూడా ఉన్నవి. కాని జీవితచరిత్రకు పద్యాన్ని స్వీకరించినపుడు దాన్ని కవితాత్మతో నిర్వహించటం కష్టం.

నేను చూచినంతకు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారి "జాతక చర్య" ఒకటి మనలను పద్యకావ్యం వలె చదవిస్తుంది. ఆ తర్వాత నాకు మళ్ళి శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి గారి అనర్ఘరాఘవమే ఆ విధంగా నడిచింది అనిపిస్తుంది. దానిలో వారు ప్రస్తావనగా వ్రాసిన 34 పద్యాలు చాలు. అవి నిలిపినంత ఉన్నతంగా శ్రీ రాఘవాచార్యుల వ్యక్తిత్వాన్ని మరే చరిత్ర నిలుపలేదనిపిస్తుంది.

మిత్రభేదంలో దమనకుడు కరటకునితో "ఏవాడు జీవింప ననేకులు జీవింతురు వాని మనుగడయే సఫలము. వాడొకడు జీవించువాడు" అని చెబుతాడు. ఆదిశేషశాస్త్రిగారు అనర్ఘరాఘవంలో ఈ ఆచార్యుల కారణంగా ఈనాటి మహాపండితులనెందరినో దానిలో ఛందోబద్ధం కవితాబద్ధం చేసి నిలిపినారు కాబట్టి ఆశ్రేయమంతా ఇపుడు ఈ రాఘవాచార్యులకే చెందుతుంది.

శ్రీ ఆదిశేషశాస్త్రిగారి కృతి ఒక సమకాలీన కవుల చరిత్రగా మహాపురుషుల చరిత్రగా ఉండగా ఇపుడు మిత్రుడు ఈ బ్రహ్మానందం గారి కృతి వారి సాహిత్య చరిత్రగా ఉంది.

మిత్రులు బ్రహ్మానందం గారిని గురించి నేను మొదట మహబూబ్‌నగర్‌లో పాలకొండ బుచ్చయ్య గారి ద్వారా రెండు మూడు తడవలు విన్నాను గాని యింకా చూడలేదు, అలా ఉండగా క్రి.శ. 1983 సెప్టెంబరు 17 నాడు రంగారెడ్డి జిల్లాలోని వికారాబాద్ విశ్వకర్మ జయంతి జరిగింది. దానికి నేను, శ్రీ అలంపురం బ్రహ్మానందం గారు, ఆంధ్ర నుండి శ్రీ కొండూరి వారు, చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి గారు ఆహ్వానింపబడినాము.

నేను హైద్రాబాదు గౌలిగూడా డిపోలో వికారాబాదు బస్ కొరకు నిలుచున్నాను. అపుడు నా ప్రక్కగా గాంధీటోపితో బక్క

పలచని మరో వ్యక్తి అదే బస్ కొరకు నిలిచినాడు. అపుడు నేను వారిని మీరెవరని అడగగా తెలిసింది అయనే శ్రీ బ్రహ్మానందం గారని. అపుడు మేం నిరీక్షించే బస్‌లోనే బ్రహ్మశ్రీ చేబ్రోలు సయ బ్రహ్మకవిగారు గూడ వస్తున్నారు. ఆ విధంగా నాకు మొదటి సారిగా వీరిద్దరి పరిచయం జరిగింది.

శ్రీరాఘవాచార్యుల వారితో 1962 నుండి ఉత్తరప్రత్యుత్తరాలు నడుస్తున్నా నేను వారిని దర్శించటంగూడ ఈ వికారాబాద్ సభలోనే ప్రథమం.

ఆచార్యుల వారితో నాకు నెలకు ఒక జాబైనా అందేది. వారెపుడ గూడ నేను షిటుపై తప్ప కార్డుపై జాబు వ్రాసినపుడు తృప్తిపడినవారుగారు, నన్ను మా చిరంజీవులను ఎంతో అభి మానించినారు, తిరుపతి దేవస్థానంలో పుస్తకాలకు ఆర్థిక సహాయం చేసే సంఘంలో వారున్నపుడు నా రచనలకు గూడ వారి సహాయం అజ్ఞాతంగా ఎంతో ఉన్నది, అపుడపుడు జాబులమూలంగా నేను వారితో ఎన్నో సందేహాలుకూడ తీర్చుకున్నాను. ఒక పర్యాయం ప్రస్తావనావశంగా వారు తమ జీవిత చరిత్రను నన్ను వ్రాయమని కోరినారుగూడ. కాని అనాటికి నేను అస్త్రసన్యాసదశలో ఉండి నా అశక్తతను వారికి విన్నవించకతప్పిందికాదు.

అపని ఇపుడు మిత్రులు శ్రీ బ్రహ్మానందంగారు చేసినారు, బ్రహ్మానందంగారు పద్యరచనలో చేయితిరిగినకవి. వారు తింథిణీ లోని మౌనేశ్వరస్వామి భక్తులు గనుక తమ యిష్టదైవంపై శతకం, ఇంకా మరి కొన్ని లఘు రచనలేగాక చిలుకూరి వేంకటేశ్వర మాహాత్మ్యం, శ్రీ విరాట్ వీరబ్రహ్మ చరిత్ర అనే ప్రసిద్ధ కావ్యాలు రచించినారు. ఇవిగాక శ్రీ కవిసింహకాశీపతిగారి సంక్షిప్త సాహిత్య

చరిత్ర, త్రిపురనేని సుబ్బారావు జీవితచరిత్ర, నాగర్‌కర్నూలు నివాసి శ్రీ చింతపట్ల నరహరిగారి సంక్షిప్త జీవితచరిత్ర, కలువకొలను నివాసి శ్రీ రామాచార్యులగారి సంక్షిప్త చరిత్ర అనే పద్య కృతులు రచించి జీవిత చిత్రణలో పరిణత హస్తులైనారు. పైవానిలో చివరి రెండు ఇంకా ముద్రితం కాలేదు.

ఇపుడిక దీన్ని పద్యకృతిగా గాక గద్యంగా వెలయించినారు, జీవిత చరిత్రకు పద్యంకంటె గద్యమే చక్కగా నప్పుతుంది కాబట్టి దీనికి వీరు గద్యాన్నెన్నుకొని ఎంతో ఔచిత్యమైన పనిచేసినారు. అయితె నాక వీరు పద్యం వ్రాసినంత ధారాళంగా గద్యం వ్రాయ గలరా అనే సందేహం మాత్రం సన్నగా అంతరంగంలో ఉన్నది. కాని యిపుడు దీన్ని చదివిన పిమ్మట నా సంశయం తీరింది, అంతే గాదు నిజానికి ఆచార్యుల వారి మాటపై నేనే ఒకవేళ ఈ రచనకు శ్రీకారం చుట్టిఉంటే ఇంత న్యాయం చేయలేకపోయేవాని నేమోగూడ అనిపిస్తుంది, ఇవి నేను ముఖస్తుతిగా అంటున్న మాటలు కావు.

శ్రీ రాఘవాచార్యుల సహజమూర్తిని, సాహిత్యమూర్తిని హితంగాను మితంగాను ఉచితంగాను ఆకృతీకరించి అక్షరబద్ధం చేసిన మిత్రులు శ్రీ బ్రహ్మానందం గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

వాణీసందనం<br>
విద్యానగర్ కాలనీ<br>
నాగర్‌కర్నూలు,<br>
శ్రీముఖ భాద్రపద పూర్ణిమ<br>
30-9-1993.

ఇట్లు<br>
సాహిత్యారాధకుడు<br>
కపిలవాయి లింగమూర్తి

# సహృదయ లేఖ

బ్రహ్మశ్రీ ఆలంపురి బ్రహ్మానందం గారూ,

నమస్కారం. మీ తాజారచన "దర్శనాచార్య శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర" ప్రకాశనాత్పూర్వప్రతిని చదివే భాగ్యం కల్గించినారు. కృతజ్ఞుణ్ణి. కవి సామ్రాట్ విశ్వనాధ వారి అభిప్రాయంలో "భారతీయ విద్యా రహస్య" మెరిగిన వారు శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులు గారు.

వారు "మనస్సన్యాసి", "జ్ఞానమొకటే మోక్ష సాధనం" అని విశ్వసించి పలికేవారు. ఎనిమిది పదుల వయసు దాటినా, ఔపనిషద వనాలలో తాము విహరిస్తూ గ్రహించే అమూల్య రహస్యమాల గ్రంధ రచనం సాగిస్తూన్నారే కాని, ఆత్మకథ వ్రాసుకోలేదింత వరకూ. ఆ ఆదర్శమూర్తి ఆత్మకథ అవసరం ఎంతైనా ఉంది. దాని కొఱత మిగిలి ఉంది. ఆ కొరతను మీ యీ గ్రంథం ఒక కొంత తీరుస్తుంది. ఆ మేరకు, మీకూ మీ కృషికీ జేజేలు.

ఆదర్శాలు, జీవుల / బ్రతుకుల స్థాయినిబట్టి పరిధినిబట్టి ఎవరివి వారికి, ఎక్కడికక్కడే తప్పనిసరిగా ఉంటాయి. అయితే ఉన్నత ఆదర్శాల విషయం వేరు. ఉన్నత ఆదర్శాలు కల వాళ్ళు "విశ్వహితులు", "జగన్మిత్రులు" అవుతారు.

ప్రజ్ఞ, ప్రతిభ, ప్రభావం, హృదయం, ఆత్మచింతనం అనే అయిదంశాలు ఏ నాటైనా, ఏ నాడైనా వ్యక్తిని మహోన్నతునిగా నిలబెడతాయి. అట్టి మహోన్నతుని జీవితం సదా ఆదర్శమయంగా

ఉండి పోతుంది. అట్లాంటివారి జీవితాలను గ్రంధస్థం చేసి ఒక తరం మరో తరానికి అందివ్వటం ద్వారా చారిత్రక విజ్ఞానంతోపాటు స్ఫూర్తినీ, ఆదర్శాన్నీ, సంప్రసారణం సమాజం బాధ్యత. విస్మరిస్తే కాచుక్కూర్చున్నకాలం, అనవాళ్లైనా మిగల్చకుండా కబళించి త్రేన్చుతుంది. సమాజం కృతఘ్నగా మిగులుతుంది. అందుకే జీవిత చరిత్రలు ఎల్లప్పుడూ ఆహ్వానింపదగిన రచనలు.

ఎవరికెంత దగ్గరగా తిరిగినా, ఎవరి నుండి ఏమేం విన్నా, వారెవరి ప్రభావమూ రాఘవాచార్యులు గారి మీద నిలువలేదు. అలాగే సాహిత్యపరంగా గానీ, రాజకీయపరంగాగానీ వచ్చిన యే ఉద్యమాల ప్రభావమూ వారిని సమ్మోహితుల్నిచేసి బంధించనూ లేదు. ఈ ప్రభావాలన్నీ అవర్ణం వంటి వారి వ్యక్తిత్వం చెంత నదులే. కానీ, వారిపై తమ తండ్రి గారి ప్రభావం చాలగానే ఉంది అనే ఒక్కమాట మాత్రం కాదనలేని సత్యం. మీ కధనంలో ఈ విషయాలకు ఛాయా సదృశమైన సాక్ష్యం ఉంది.

ధార్మిక, తాత్త్విక విషయాలను వివరించే చోట్లలో దర్శనాచార్యగారి ఓర్పు - తీర్పు ఆహా ! అనిపిస్తాయి. ప్రత్యానంద తత్త్వం అంటూ ప్రత్యేక తాత్త్వికశాఖ వారి పెక్కు రచనల్లో తొంగిచూస్తూ ఉందేమో అని అపుడపుడనిపిస్తుంది. మీ వంటి పెద్దలు పూనుకుంటే అట్లాంటి రహస్యాలు, మెఱుగులు దర్శనాచార్య సాహిత్యం నుండి బయటపడతాయి.

"అతడు వ్రాసిన గ్రంథాల యట్టివాని
నన్యులెవ్వరు వ్రాయ లే రన్యరచిత
కృతుల వంటివి వాతండు తానెన్నడేని
వ్రాయ దట్టిది కొండూరి వారి ప్రతిభ" -

( అనర్ఘరాఘవం, పుట : 134 )

అని శ్రీ ఆచార్య ద్రోణప్ప గారు వెలిబుచ్చిన యభిప్రాయము ముమ్మాటికి నిజం. రాఘవాచార్యుల వంటి వారు రాఘవాచార్యులే.

వారి జీవిత కథనం పద్యమాధ్యమంలో వంగవోలు ఆదిశేష శాస్త్రి గారు గతంలో వెలువరించారు. వచనంగా కథనం చేశారు యిపుడు మీరు. ఒకనాడు శ్రీ త్రిపురనేని సుబ్బారావు గారు వచనంగా వ్రాయగా కవి సింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్రను పద్యబంధంగా వెలయించారు మీరు. పూర్వరూపాల ముందు మీరు మలచిన రూపాలు అనుకృతాలుగా గాక అధిగుణావహాలుగా మాన్యాలు.

ఆత్మదర్శనం నేను (అహం)తో ప్రారంభమై మోక్షంతో ముగిసిన తీరున గల ఔచిత్యాన్ని బాగా ఎత్తిచూపారు. "ఆత్మ దర్శనము జగదీశ్వర (పరమ) తత్త్వ ప్రకాశమగుచో నీ శిల్ప దర్శనము జగద్రూపతత్త్వ ప్రకాశ విజ్ఞానము" అని రెండు దర్శనాల స్వభావాల్ని ఒక్క వాక్యంతో చక్కగా తెలిపారు. ఋగ్యజుర్వేద దర్శనాలలోని విశేషాలు ఎంత మహత్తరమైనవో చెప్పిన చోట మీరు పాటించిన సూటిదనం, సారళ్యం, గ్రహణ సౌలభ్యం ప్రశంసనీయాలు. ముప్పున కొకటి రెండు అంటూ మిత్ర సాహస్రి నుండి ఎత్తిచూపిన పద్యాలు ఉచితాలేకాక మీ హృదయ సౌందర్య సంపదనున్నూ వెల్లడి చేస్తాయి. కొన్ని పుటల్లో సాగిన వ్యాఖ్యానాలు ఈ గ్రంథం "చరిత్ర గ్రంథం" అన్న విషయం మరిపిస్తాయి.

రచనల పట్టికైనా ఇవ్వకుండా, వాని రచనా ప్రచురణకాలాల వివరాలు ఎక్కువగా లేకుండా, సందేహాస్పదంగా వాని సంఖ్యలు ఇవ్వటం, నవల మరియు విమర్శనా సాహిత్య విభాగానికి చోటే లభించక పోవటం, అథర్వవేద దర్శనం ప్రసక్తం కాకపోవటం గ్రంథ విస్తరభీతివే మాత్రమే జరిగాయనుకుంటున్నాను.

ఏదేమైనా మీ ఈ రచన సమగ్రంగా రాఘవాచార్యులుగారి సాహిత్య జీవిత చరిత్రలు వ్రాయడానికి ఔత్సాహికులకు ప్రేరణంగా సంప్రదానంగానూ తప్పక దోహదపడుతుంది. మీ రచనలు పెక్కులు వ్రాతప్రతులుగానే చూస్తున్న సందర్భంగా మీకు అభినందనం.

సం॥...................

10 అక్టోబరు 1993 కొల్లోజు కనకాచారి

నాగార్జునసాగర్ ఎం.ఓ.ఎల్. డిప్లొమా ఇన్ బెంగాలి

(ERLC)



# అభిప్రాయము

విజయరత్న పసునూరు బ్రహ్మానందాచారి,
కర్షక్ ఇండస్ట్రీస్ హైదరాబాద్.

పవిత్ర ఆత్మస్వరూపాలు బ్ర॥శ్రీ॥ ఆలంపురి బ్రహ్మానందంగారూ! మీరు విశ్వకర్మకుల భూషణులగు బ్రహ్మశ్రీ కొండూరు వీర రాఘవాచార్యుల జీవిత చరిత్రను వ్రాసి విశ్వకర్మజాతికి ఎంతో మహోపకారము చేసితిరి. వేదాలు చదువుకొనుటకు అందుబాటులో లేని మన జాతీయులను ప్రోత్సహించి, తెనాలిలో యలవర్తి ఆంజనేయశాస్త్రిగారిచే స్థాపించబడిన 'వేదపాఠశాల' కెంతో సేవాభావముతో అచ్చట విద్యనభ్యసింపజేసే అధ్యాపక వేద పండితులను శ్రీ మద్దర్శనాచార్యులవారు తీర్చిదిద్దిరి.

ఆచార్యులవారు రచియించిన ఋగ్వేద-యజుర్వేద దిగ్దర్శనములు, ఋగ్వేద రహస్యాలు, విశ్వకర్మ-పురుషసూక్తాదులు గాయత్రీ విశ్వకర్మలు, మరియు మృత్యుంజయాది మంత్రముల భావార్థములను సామాన్యులకు అర్థమయ్యేరీతిలో తెలిపిరి. శ్రీవారి అపూర్వోజ్వల కృషికి ఫలితముగా వారికి లభించిన సత్కారసన్మానము లనేకము. అందుకు నిదర్శనముగా 1) దర్శనాచార్య 2) కళాప్రపూర్ణ 3) విద్యాభూషణ 4) విద్యాధురీణాది అసంఖ్యాకబిరుదములు ప్రఖ్యాతమైనవి.

క్రీ.శ. 1985లో నేను హైదరాబాదు నగరములో శ్రీ విరాడ్విశ్వకర్మ యజ్ఞమును, ప్రధానకార్యదర్శిగాయుండి, నిర్వహించిన

సందర్భము తేది 17-9-1985 రోజున ఆచార్యులవారికి ఘనసన్మా
నము జరుపగా నన్ను ఆలింగనముచేసి నాకెంతో ఆత్మానందాను
భూతిని కలిగించి, నన్ను "బాబు" అని సంబోధించి ఆనందబాష్ప
ములురల ఎంతో తృప్తి చెందిరి. ఇతర సమాజములు ఎంతో ఘన
ముగా సన్మానించుట ఒక ఎత్తు, ఇప్పుడు మన జాతీయులు గౌర
వించటము తమకు మహదానందముగా ఉన్నదని చెప్పిరి. అది
మరుపురాని రోజు నాకు. నాచే నిర్వహింపబడు ఏ కార్యక్రమ
మన్నను వారికి సంపూర్ణ విశ్వాసము. ఈలాంటి మహనీయుని జీవిత
చరిత్ర మన జాతీయులకు ఎంతో అవసరము.

"కవిత చెప్పడు ఋషివంశఘనుడు కాక" అన్నట్లు బ్ర॥శ్రీ॥
ఆలంపురి బ్రహ్మానందంగారూ! మీ కృషి చాలా అమోఘము. మీరు
తెలంగాణా కవి సార్వభౌములలో నొకరుగా వెలుగొంది మన జాతిని
పునీతము చేసితిరి. విశేషించి 'దర్శనాచార్య - కళాప్రపూర్ణ' శ్రీ
కొండూరి వీర రాఘవాచార్యుల జీవిత చరిత్రను వ్రాసిన మిమ్ములను
ఈ సమాజము ఎన్నటికి మరువదు.

మీ కీర్తి ఆచంద్రార్కము వెలుగొందాలని ఆ విశ్వకర్మ
భగవానుని ప్రార్థిస్తున్నాను.

13-10-1993 - పసుపూరి బ్రహ్మానందాచారి

మన కొండూరు

# తాత్త్వికమూర్తి

(మచిలీపట్నం జాతీయ కళాశాల రిటైర్డు ప్రిన్సిపాల్,

పండిత శ్రేష్ఠులు

**శ్రీ భాగవతుల కుటుంబరావు గారు**

ఆచార్యులవారి తాత్త్విక గ్రంథాలను చదివి వ్రాసిన వాక్యాలు)

దర్శనాచార్య, కళాప్రపూర్ణ

**డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు గారు**

నేటి ఆంధ్రులకు గర్వకారణమైన మహనీయులలో ఒకరు

వీరిని తలచుకొన్నప్పుడెల్లా "సముదితః గుణానాం సముదయః" అనే శ్రీ హర్షవాక్యం స్మృతికి వస్తుంది. ఆంధ్ర సంస్కృత భాషా పాండిత్యం, విమర్శకత్వం, కవిత్వము, యోగము, ఆధ్యాత్మ విజ్ఞానము, దర్శన పరిజ్ఞానము, వేదదిగ్దర్శనము, తపస్సు, బోధకత, అనుష్ఠానము వీరిలో చోటుచేసుకొన్నై.

వీరు పట్టింది బంగారం అవుతుంది. ఏ రచనచేసినా అందులో విషయం కూలంకషంగా, విశదంగా, సుబోధంగా ఉంటుంది. తాము చెప్పే విషయాన్ని తాము అనుభవపూర్వకంగా అవగాహన చేసుకొన్నవారే ఈ విధంగా ప్రతిపాదన చేయగలుగుతారు. శిష్యులకు కలిగే సంశయాల నూహించి, వాటికి సమాధానాన్ని ఇస్తూ సిద్ధాంతాలనేగాక, సాధన మార్గాలను గూడ బోధిస్తున్న ఒక గురువు వాంకుల మనోవీధిలో అడుగడుగునా సాక్షాత్కరిస్తాడు. 'అధ్యాస మిథ్యా, శూన్యవాదాది" జటిలమైన విషయాలను అతిసులభంగా



కళాప్రపూర్ణ
దర్శనాచార్య
శ్రీ కొండూరు
వీరరాఘవాచార్యులు

బోధింపగలిగారు. పాండిత్యము, బోధకత, అనే రెండూకల ఉత్తమ గురువులు వీరు.

"యస్యోభయం సాధు స శిక్షకానాం
ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ".

శిల్ప, యోగ, ఆత్మదర్శనాలు, తత్త్వసాధన, తత్త్వసూక్తులు-అనే వీరి గ్రంథాలు విజ్ఞానానికీ, సాధనకు గూడ సోపానాలుగా ఉపయోగించే ఉత్తమ గ్రంథాలు. వీరి "మిత్రసాహస్రి"కి ఆంధ్ర శతక వాఙ్మయంలో చిరస్థానం లభిస్తుంది.

ఇవన్నీ ఒకయెత్తు, వీరు తమ చరమ వయస్సులో చిర తపః ఫలముగా రచించి, ఆంధ్రులకు, ఆంధ్ర వాఙ్మయానికి, ఎనలేని కానుకగా సమర్పించిన "ఋక్, యజు, రథర్వవేద దర్శనాలు, ఋగ్వేద రహస్యాలు" అనే గ్రంథాలు ఒక యెత్తు. ఇందులో వీరు ఆయా దేవతా తత్త్వ స్వరూపవర్ణన, ఆయా మంత్రార్థ ప్రతిపాదనలలో చూపించిన ప్రతిభ ఆ గ్రంథాలను చదివినవారికే తెలుస్తుంది. వీటిలో కూడ వీటి అన్నిటిని మించినది వీరు ప్రతిపాదించిన "విశ్వకర్మ బ్రహ్మ సిద్ధాంతము. ఇది అనిదం పూర్వము. యుక్తి ప్రమాణ సిద్ధము". వేదములలోని విశ్వకర్మయే ఉపనిషత్తుల లోని బ్రహ్మము-అని సిద్ధాంతీకరించి విశ్వకర్మకు సర్వదేవతా సార్వభౌమ పట్టాభిషేకం చేసినారు. ("యోదేవానాం నామధా ఏకఏవ" అని ఋక్కు కదా) ఈ గ్రంథాలలో-"ఏకంసత్, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" అనే వాక్యాలను వేదముల లోని విషయాలకు సమన్వయించి అద్వైత వాదంలో ఒక విశిష్ట మార్గాన్ని సూచించిన కీర్తి కూడ వీరికే దక్కుతుంది. వీరి గ్రంథాలు

ప్రపంచ భాషలలోకి అనువదింపబడితే లోకానికి ఎనలేని మేలు చేకూరుతుంది. అందుకు ప్రభుత్వం పూనుకోవాలి వీరి గ్రంథాలను అందరు చదివి ధన్యులు కావాలని కోరుతున్నాను. వీరి గ్రంథాలను అందరు చదివి ధన్యులు కావాలని కోరుతున్నాను. వీరికి నా హృదయ పూర్వకాభివందనాలను అందచేస్తున్నాను.

(సం.)
భాగవతుల కుటుంబరావు
20-7-92

-: (౦) :-

గ్రంథ ముద్రణకు

రూ॥ **2,125** లు విరాళమొసగిన

వదాన్యులు



బ్రహ్మశ్రీ ఏ. అరవిందాచార్యులు

తద్ధర్మపత్ని

**శ్రీమతి ప్రతిభాదేవి గారు**

( ప్రాజెక్ట్ మేనేజర్, కావేరీ మైనింగ్ కంపెని )

పాండుచ్చేరి

గ్రంథ ముద్రణకు

రూ॥ 1,116 లు విరాళమొసగిన

వ దా న్యు లు



బ్రహ్మశ్రీ ఏ. రవీంద్రాచార్యులు

త ద్ధ ర్మ ప త్ని

శ్రీమతి ప్రపన్నతాదేవి గారు

( మెకానికల్ ఇంజనీర్, N. T. P. C. )

క రీం న గ ర్

గ్రంథ ముద్రణకు

రూ॥ 1,116 లు విరాళమొసగిన

వదాన్యులు





బ్రహ్మశ్రీ విజయరత్న పసునూరి బ్రహ్మానందాచార్యులు

తద్ధర్మపత్ని

శ్రీమతి గోవిందమ్మ గారు

( ప్రముఖ పారిశ్రామికవేత్త )

హైదరాబాద్

గ్రంథ ముద్రణకు

రూ॥ **1,116** లు విరాళ మొసగిన

వదాన్యులు



బ్రహ్మశ్రీ చింతలపాటి నాగభూషణం గారు

తద్ధర్మపత్ని

**శ్రీమతి చంద్రావతి గారు**

( రిటైర్డ్ రైల్వే ఉద్యోగి )

సికింద్రాబాద్

ఋగ్యజురాధర్వవేదములను క్షుణ్ణముగా దర్శించి అందలి ఆధ్యాత్మికతత్త్వరహస్యములను, విశ్వస్రష్టయైన పరబ్రహ్మతత్త్వమును సులభగ్రాహ్యమొనర్చుచు, అనేక గ్రంథములు రచించినారు.

ఇంతటి విజ్ఞానఖనియైన దర్శనాచార్యుల కీర్తి ఆంధ్రావని లోనే కాదు మన రాష్ట్రపతివరకు ప్రసరించినదనిన వీరి విద్వద్వృత్తిశక్తియెట్టిదో పరిత్యలోకమే ఊహించగలదు, ఇట్టి వీరిచరిత్రము, వీరి సాహిత్య, సారస్వత, విజ్ఞానైశ్వర్యమును తెలియజేయక లోకమును త్తేజపరుపకుండిన యెడల ఉచితము కాదను బుద్ధిచే "దర్శనాచార్య శ్రీ కొండూరు సాహిత్య జీవితచరిత్ర"మను పేర నీ చిఱు పొత్తమును వ్రాయ యత్నింపకడంగితి.

వాస్తవముగ "ఆచార్యులు ఆచార్యులే!" వీరిని గూర్చి వ్రాయుట దినకరుని ముందు దివ్వెనుంచునట్టిదే! అయినను ఇందుకు సాహసించితిని. ఈ నా సాహసము నేటివారికిని రాబోవు వారికిని నిద్రాణమైయున్న భారతీయ సంప్రదాయ సంస్కృతులను ప్రబోధపరచి ఉత్తేజమొనగూర్చుటలో సార్థకమగుచో ధన్యుడనయ్యెదనని విశ్వసించుచున్నాడను.

నేనర్థించునంతనే ప్రేమతో తమ అమూల్యాభిప్రాయాక్షర జ్యోతితో ప్రకాశింపచేసిన సహృదయులును, సారస్వత ప్రియులును "సాహిత్యబ్రహ్మ" బిరుదాంచితులగు డా॥ వాసిలి వేంకట లక్ష్మి నరసింహారావు గారికిని, నిన్నమొన్ననే శస్త్రచికిత్స నుండి స్వస్థులైన "సాహిత్యారాధకు"లగు బ్రహ్మశ్రీ కపిలవాయి లింగమూర్తి గారికిని, దర్శనాచార్య సాహిత్యపరిశోధనా ప్రకాముకులును బ్ర॥శ్రీ॥ కే. కనకాచార్యులు గారికిని, మరియు బ్ర॥శ్రీ॥ పసునూరి బ్రహ్మానందాచార్యులకును హార్దికానేక కృతజ్ఞతాభివందనములర్పించుచు.

కోరినదే తడవుగా నీ గ్రంథ ముద్రణకై ఆత్మీయతతో ధన సహాయమొసంగిన వదాన్యులగు సర్వ బ్రా॥శ్రీ॥ విజయరత్న "శ్రీ పసునూరి బ్రహ్మానందాచార్యులు (హైదరాబాద్) గారికిని, ఆయుష్మంతులు ఏ. రవీంద్రాచార్య-అరవిందాచార్యులకును, వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి (విశ్వకర్మ ధర్మపీఠ సంచాలకులు) గారికిని, చింతలపాటి నాగభూషణం గారికిని, మరియు టి. రామయ్య (హైదరాబాద్) గారికిని హృదయపూర్వక ధన్యవాదములు పలుకుచున్న —

గ్రంథకర్త



# వి ష య సూ చి క

| క్ర. స. | విషయము | పుట |
|---|---|---|
| 1. | చరిత్రోపక్రమము | 1 |
| 2. | వీరరాఘవాచార్యుల గోత్రాదికములు | 2 |
| 3. | కోటీశ్వరాచార్యుల సచ్ఛీలత | 5 |
| 4. | వీరరాఘవాచార్యుల జన్మవిశేషము(లు) | 6 |
| 5. | వీరరాఘవుని వివాహము | 9 |
| 6. | వీరరాఘవాచార్యుల గీర్వాణ భాషాభ్యసనము | 10 |
| 7. | ఆచార్యులవారి సమతాభావము | 13 |
| 8. | జాతీయోద్యమాభినివేశము | 14 |
| 9. | శ్రీ నిరంజన శాస్త్రిగారితో సాహచర్యము | 15 |
| 10. | ఉద్యోగప్రయత్నము | 17 |
| 11. | దక్షిణదేశయాత్ర | 17 |
| 12. | కంచికాళహస్త్యాదిక్షేత్ర దర్శనము | 19 |
| 13. | వ్యాసాశ్రమము | 20 |
| 14. | శ్రీ గాయత్రీ పీఠాధిపతుల ఆదరప్రాప్తి | 21 |
| 15. | ఆచార్యులవారి నిరీహత | 24 |
| 16. | విశ్వబ్రాహ్మణ జనాభిమానము | 25 |
| 17. | ఉద్యోగము శారదానికేతనము | 26 |
| 18 | ఆచార్యులవారి అధ్యాపకత్వము | 27 |
| 19 | బిరుదములు | 28 |
| 20 | పత్రికా సంపాదకత్వము | 29 |
| 21. | ఆంధ్రశిల్పకళాపరిషత్తు | 29 |

ఓం నమో విశ్వకర్మణే

# దర్శనాచార్య

# శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర

విశ్వ స్రష్టచే వెలయింపబడిన ఈ విశ్వమందలి ప్రాణి కోటిలో మానవ జన్మ మత్యుత్కృష్టమైనదని శాస్త్రము లుగ్గడించినవి. అట్టి మానవ జన్మము కల్గుట వాస్తవముగ సకల ప్రాణులలో దుర్లభమేగాక, ఆ మానవునకు ముముక్షత్వ జ్ఞానాభిలాష కలుగుట ఇంక దుర్లభమని తోచును ఇట్టి అలభ్యములు లభించుట ఆ మానవుని పూర్వకృత పుణ్యఫలమేయని అనవలయును. దైవానుగ్రహము లేనిది అది ప్రాప్తించదని నొక్కివక్కాణింపవచ్చును. భగవదనుగ్రహముచే జనించిన మానవులెందర భువిపై లేరు? ఉన్నను ఆ యందఱిలో వారి జన్మకారకుడైన సృష్టికర్తను గూర్చి ఆలోచించు వారెందరు? ఏ నూటికో కోటికో యొకరిద్దరుండి యుందురనుట మతిశయముకాదు. అట్టి వారిలో సైతము సృష్టిగూర్చి, సృష్టికర్తను గూర్చి, సృష్టి కర్మమును గూర్చి మరియు తమను, తమ జీవిత ధ్యేయమును, తమ కర్తవ్యముమ గూర్చి ఆలోచింపగల వారెందరు, అతి స్వల్ప సంఖ్య అనవలయును. ఇట్టి స్వల్ప సంఖ్యలో పరిగణింపబడెడు వారిలో గూడ వారార్జించిన విజ్ఞానమును లోకమునకు పంచిపెట్టి లోకము నుద్ధరింప నిచ్ఛగల వారెందరు? చాల అరుదు. కావుననే అట్టివారిని నూటి కొక్కరనుటకంటె కోటి కొక్కరని అనవలసియుండును. అట్టి అరుదైన వారిలో "పరోపకారార్థ మిదం శరీరం" బనియేగాక "ఇదం జ్ఞాన" మను బుద్ధిగల ఋషి తుల్యులును, ఋక్ - సామ - యజురాధర్వాద్యాగమములను దర్శించిన దర్శనాచార్యులు బ్రహ్మశ్రీ డా॥ కొండూరు వీరరాఘవాచార్య కళాప్రపూర్ణ లీనాడాంధ్రావనిలో పండిత ప్రకాండ ప్రద్యోతనుడుగా వెలుగుచున్నారనిన సత్యదూరముకాదు. ఇంతటి అత్యున్నత, మహా

ధీమంతుని జీవితమునుగూర్చి సంగ్రహముగానైనను మనము తెలిసి కొనుట ఒక విశేషమేగాక తెలుగు భారతిని గౌరవించుట యగును.

## వీరరాఘవాచార్యుల గోత్రాదికములు

శ్రీ వీరరాఘవాచార్యులవారు విరాడ్విశ్వకర్మ పంచాననోద్భవులగు సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సువర్ణ బ్రహ్మలలోని ప్రత్నర్షి గోత్రోద్భవులు. ఉప ప్రత్నర్షియైన వాస్తోష్పతి శాఖలో తత్పురుష ప్రవరాన్వితులు. అధర్వ వేదీయులు. వీరి పూర్వజులు తరతరములనుండి "కోపల్లె" యను గ్రామ వాసులు. ఆంధ్రరాష్ట్రమున "తెనాలి" నగర సమీపమున నీ గ్రామము కలదు. వీరి పితామహులు పంచానన ధర్మనిరతులైన శ్రీనాగలింగాచార్యులు. వీరు స్వకులాచార ధర్మమర్మజ్ఞులు, నియమ నిష్ఠాగరిష్ఠులు. ఈయన అథర్వాగమాధ్యయన సంపన్నుడై అనూచానముగావచ్చు శిల్ప కల్పనాచణుడయ్యును దైవజ్ఞ బ్రహ్మ శిల్ప సూత్రధారిగా సర్వజనాదరణీయుఁడై యుండెడివాడు, శ్రీ మత్పరమేశ్వరీ ఉపాసకుడు, పంచ శిల్పములందు ప్రాజ్ఞుడుగా ఖ్యాతి గడించిన కర్మఠుడు, సత్యవచనుడు, ఏకపత్నీవ్రతుడు. యోగీశ్వరీతుల్యయగు సాధ్వి "నాగమ్మ" ఈ నాగలింగాచార్యుల అర్ధాంగ లక్ష్మి ఈ ఇరువురు, గాయత్రీ విశ్వకర్మలవలె, శరీరములు వేరయ్యును హృదయైక స్వభావులై గార్హస్థ్య ధర్మము నెఱపుచు ఆనంద సింధు వేలికలలో నీదుచు నాదర్శ దంపతులని పేరు కాంచినారు. శ్రీనాగలింగాచార్యులు "దేవీ" ఉపాసకులని పైన తెలుపనైనది. ఎతత్కారణమున వీరొకప్పుడు నిరాహార వ్రత దీక్షాబద్ధ కంకణులై శ్రీ బాలాత్రిపుర సుందరీ కృపాభిలాషియై ఏకవింశదహోరాత్రములు వేదోక్త పథంబున "త్రిపుర సుందరీ" దేవిని గూర్చి తప

స్సానరించిరి. ఇనువ దొక్కటవ దివసమున శ్రీదేవి సాక్షాత్క-
రించినది. శ్రీదేవి దర్శనమాత్రమున నాగలింగాచార్యులు ఆశ్చర్య
చకిత పులకాంకితాంతరంగులై సాష్టాంగపడి దేవిని స్తుతింప
సమ్మాతృమూర్తి కరుణామృత దృష్టులంగని యిట్లు పలికెనని
యొక పరంపరాగత విశ్రుతగాథ.

"వత్సా! నాగలింగాచార్యా! నీ తపంబునకు, నీ భక్తిశ్రద్ధ
లకు హర్షించితిని. నీ వంశమున నిటనుండి పారంపర్యముగా"
శ్రీవిద్య (బ్రహ్మ విద్య) ప్రాప్తించుగాక. ఆత్మ విద్య, శిల్ప విద్య,
వేద విద్య నీయింట కల్పతరువులై వెలయుచుండుగాక. నేను
మీయిలు (యిల)వేల్పునై సర్వదా రక్షింతును. నీవంశమున దయా
సాగరుడైన పరమేశ్వరాంశజు డుదయించి మీ వంగడమును పునీత
మొనర్చు"నని దీవించి దేవి అంతర్హితయయ్యెను. ఇంతటి ఉత్కృష్ట
వంశ మీ కొండూరు వారిది.

ఇట్లు నాగలింగాచార్యులు తపోనిధియై నిజ జీవితము గడుపుచు
క్రమముగా కోటీశ్వరాచార్య, యోగీశ్వరాచార్యులను నిరువుర
పుత్రులను గాంచెను. పరమ శివునకు పుత్రద్వయమువలె జనియించిన
ఈ యిరువురు కుమారులు జననీ జనకుల కనుసన్నలతో మెలగుచు
వారి సుబోధిత బుద్ధులు గఱచి స్వకులాచార ధర్మవర్తనులునై
తండ్రిగారి పాదముద్రలలో చరించుచు, తండ్రియొద్దనే ఆరంభ
విద్య అభ్యసించిరి. నాగలింగాచార్యు లీ కుమారులిద్దరకు సకాలము
ననే యుపనయన మొనర్చి బ్రహ్మోపదేశము చేసిరి తదనంతర
మా కుమారులను విద్యావినయ సద్గుణాభివృద్ధుల చేయుటకు మంచి
గురువుల కడకు పంపిరి. వారు గురుబోధిత పద్ధతిన విద్యలభ్యసించి,
సద్గ్రంథములు పఠించి, శాస్త్రము లధ్యయన మొనర్చిరి. తత్పరి

తండ్రిగారివద్ద శిల్పవిద్య, యోగవిద్య లభ్యసించిరి. విశేషించి కోటీశ్వరాచార్యులు బ్ర॥ శ్రీ॥ పరిమి వీరాచార్యులచే కటాక్షమొంది ఆధ్యాత్మిక విద్యలో కూడ విజ్ఞత గడించిరి.

ఈపాటికి కోటీశ్వరాచార్యులు గ్రామ మందలి పెద్దలచే, బంధువర్గముచే నచ్చిలుడని ప్రశంసలందుచుండిరి పరిణయయోగ్య ప్రాయుడగుటచే కోటీశ్వరునకు నాగలింగాచార్యులు తమ బంధు వర్గమునందలి యొక కులీన వంశజయైన "పార్వతమ్మ" యను సుగుణతో వివాహము జరిపించిరి. ఆయమ సార్థక నామధేయమై ఈశ్వరునకు పార్వతివలె కోటీశ్వరున కర్ధాంగియై సతిత్వము నందెన లేని సతీవణిగా వెలసి సంఘమునందొక ఆదర్శ మహిళగా ఖ్యాతి గడించినది. గృహమునందొక అతివయేగాని, యొక గోవే గాని కాలిడిన వేళనుబట్టి ఆ యింటికి వృద్ధ్యవృద్ధులు కల్గునని లోకము దలంచుట సర్వత్రతులెఱిగినదే. పార్వతమ్మగారు కోటీశ్వరా చార్యుల ఇల్లాలుగ కాలిడిన సుముహూర్త మెంతటిదో కాని అప్పటి నుండి ఆ గృహము మూడు పూవు లాఱు కాయలుగా నభివృద్ధి చెందినది. నాగలింగాచార్యుల కిరువురు పుత్రులు గలుగ నీకోటీశ్వ రులకు ద్విగుణీకృత సంతతి కలిగి గృహము విస్తృత వికాస మొంది కలకలలాడినది. ఈ కోటీశ్వరులకు జ్యేష్ఠాదిక్రమముగా నాగమ్మ - ఈశ్వరమ్మ - వీరరాఘవుడు మరియు వేంకటసుబ్బమ్మ యను పుత్రికాత్రయమును నొక పుత్రుడును కల్గిరి.[1]

కోటీశ్వరాచార్యులు జ్యోతిశ్శాస్త్రమున కోవిదులై, వాస్త్వాగ మము లందనన్య ప్రవీణులై నెలయుటవలన వారి గృహము సర్వదా

1. ఈలోగ (కతిపయ కాలమునకు పూర్వమే) ఒక ముక్కోటి ఏకాదశిన వ్రతనిష్ఠులైయుండి నాగలింగాచార్యులు అనూహ్యముగ విశ్వకర్మ సాయుజ్యమందినారు.

ఆగమ, వాస్తు శాస్త్ర పండితులతోడను జ్యోతిషవేదులతోడను నదియొక గోష్ఠి నికేతనముగా నుండెడిది. శిల్ప కృత్యముల కాటపట్టై వెలసెడిదన నసత్యముకాదు, ఆగంతుక పండితులు, శాస్త్రజ్ఞులు, కవు లీ కోటీశ్వరాచార్యులతో చర్చాగోష్ఠులు సలుపుచుండ కుమార రాఘవుడెంతో భక్తిశ్రద్ధలతో వినుచుండెడివాడు. వారి సంభాషణము లందలి సారాంశము నాకళింపు చేసికొని హృదయమున నిలుపుకొనెడివాడు.

## 'కోటీశ్వరాచార్యుల సచ్ఛీలత"

లోకమునద్వైన చింతనాపరులైన సచ్ఛీలురకే యిక్కట్లు సంభవించు నన్నట్లు వీరరాఘవచార్యుల తల్లి పార్వతమ్మగారు అతని ఆజేండ్ల బాల్యముననే పరమ పద ప్రాప్తినందినది. ఆనాటి నుండి ఆనలువుర బాలురను తల్లిలేని వారను లోపములేకుండ కోటీశ్వరచార్యులే, తత్వజ్ఞానియగుట వలన, ధైర్యములో తామే తల్లియు, దండ్రియు, గురువునై అత్యంతలాలనతో మధురానురాగముతో కంటికి రెప్పవలె పెంచి పోషించి విద్యా బుద్ధులు గఱపుచు పరబ్రహ్మ చింతనామృత మత్త మదాళమై తమ జీవితము గడుపు చుండెనే కాని స్వార్ధ పరతతో ధర్మార్ధకామ మోక్షములందలి తృతీయ పురుషార్ధము నందిచ్ఛగొనక ద్వితీయవివాహమును వాంఛింపలేదు. ధర్మమోక్షములే నిత్యనైమిత్తికాచారముల కన్నమిన్నయని యెంచి తను సంతానమును లోకమున కాదర్శవంతముగా తీర్చిదిద్దినారు.

భార్యా వియోగమందిన వాఱెందఱో సంసార మీద జాలక మరొక వివాహమో లేక సన్యసించుటయో చేయుదురు. కాని, శ్రీకోటీశ్వరాచార్యులట్లు సేయకయే, యేదియును సన్యసించకయే వైరాగ్యభావులై కేవలము పరమేశ్వర చింతనతోనే కాలము గడుపు

చుండెను సంధ్యా వేళలందు పురాణ విశేషములు, సజ్జన చరిత్రములు, సద్గుణ గాథలు వీనులవిందుగా తమ స్నేహితులకు, ఇరుగు పొరుగువారికి వినిపించి సర్వులకు జ్ఞానోదయము గలిగించుచుండెడివారు,

ఇదిట్లుండ, తమ సంతానము విద్యాబుద్ధులం దేరీతి వృద్ధి నొందుచున్నదో, వయసునం దారీతి వృద్ధిజెందుచుండ వారి వైవాహిక కార్యములు నెరవేర్చుట తండ్రియొక్క విధ్యుక్త ధర్మమని కోటీశ్వరులు కన్యాదాన ప్రవణులై కర్తవ్యము నెరవేర్చిరి.

## వీరరాఘవాచార్యుల జన్మ విశేషము

కోటీశ్వరాచార్యుల ఏకైక పుత్రుడు శ్రీ వీరరాఘవాచార్యులని పైన వచింపనైనది. వీరొక ఆదర్శవంతమైన జీవిత చరిత్ర వాఙ్మయ, సాహిత్య చరిత్రకలవారు. శ్రుత్యాగమ జలధి మథించి అందణగియున్న అమూల్య రత్నములను వెలికి తీసిన విశిష్ట పరిశోధకులు. వీరి ఋగ్యజురాది దర్శన, దిగ్దర్శన రహస్యాలు చూచు భాగ్యము కల్గినది. అవి అత్యంత పఠనీయ గ్రంథములు. విద్వజ్జనాదరణీయ రచనలు, కవి వరేణ్యులును, కళాప్రపూర్ణులునునైన వీరరాఘవాచార్యులతో నాకు దాదాపు పది- పండ్రెండేండ్ల నాటి పరిచయము. వికారాబాద్ - రంగారెడ్డి జిల్లాలో జరిగిన శ్రీ విశ్వకర్మ జయంత్యుత్సవమున శ్రీవారితోను, మణికుండల గండపెండేర భూషిత బ్ర॥ శ్రీ॥ చేబోలు చిన్మయ బ్రహ్మకవి (విశ్వకర్మ ధర్మ పీఠాధ్యక్షులు రాజమహేంద్రవరము) గారితోను, మరియు సాహిత్యారాధకులు బ్ర॥ శ్రీ॥ కపిలవాయి లింగమూర్తి (నాగర కర్నూలు) గారితోను పరిచయము కల్గినది. ఈ మధ్య, తేది 16 జనవరి 1992న సంక్రాంతి పర్వణి సందర్భమున నీ వీరరాఘవాచార్యుల వారితో,

పూర్వ పరిచయమును పురస్కరించి, హైద్రాబాద్‌లో, మరొక పర్యాయము కలువ నవకాశము కల్గినది. సుహృద్భావ సంభాషణ మున నాచార్యులవారి జీవిత చరిత్రమును వచన రూపమున వ్రాయ ప్రోత్సాహక ప్రస్తావన, ఈ రచయితతో ప్రేరేపణ సూచకముగా వచ్చినది. ఆ కారణమున ఆదరణీయ ఆచార్యులవారి చరిత్రము లోకమెఱుంగవలెనని, ఉత్సాహమున, సంక్షిప్తమేయైనను వ్రాయ నిశ్చయించితిని.

శ్రీ వీరరాఘవాచార్యులు కోటీశ్వరచార్యుల సుపుత్రుడని ఇది వరకే తెలిసి కొంటిమి. వీరిజననము గూర్చి యొక విశిష్ట గాథయిట్లు కలదు. వీరి జనయిత్రి పార్వతమ్మగారు అత్యంత దైవభక్తిగల సాధ్వి ఆయమ శ్రీతిరువళ్ళూరు ధామమున వెలసియున్న "శ్రీ వీరరాఘవ స్వామి" భక్తురాలు. ఆదేవుడు అమావాస్యావ్రత ప్రీతుడని ప్రసిద్ధి. పార్వతమ్మగారు అమాస్యవ్రతము కడు దీక్షతో సలుపు చుండెడిది. శ్రీ స్వామివారు భక్తవరదుండగుటచే నాయమ భక్తికి, వ్రతదీక్షకు సంతుష్టుడై భక్తురాలి వాంఛాఫల సిద్ధిగా క్రి శ. 1912 సెప్టెంబర్ 26వ తేది (శా.శ ౧౮౩౪, పరీథావి సం॥ర భాద్రపద శుక్ల ౧౫ గురువారము) అనగా దీక్షా కాలమునం దీపుత్రుడుదయించినాడు. అందుచే నాస్వామియే తన గర్భమున నుదయించి తనను పునీత మొనర్చినాడని ఆయమ్మ భావించినది ఈయమ భావమునకు, శ్రీనాగలింగాచార్యులకు త్రిపుర సుందరీదేవి ప్రత్యక్షమై వచించిన వాక్యములకు నేదో అంతర్నిహిత సంబంధముండి యుండునని కోటీ శ్వరాచార్యులు కూడ విశ్వసించినారు. ఏ తత్కారణమున నా తల్లి దండ్రులా శిశువునకు, భగవన్నామ విస్మృతి కలుగ కుండుటకై "వీరరాఘవాచార్యు"డని పేరు పెటుకొన్నాడు. వీరికి నాగమ్మ,

ఈశ్వరమ్మయను నిర్వురక్కలు, ఒక సోదరి వేంకట సుబ్బమ్మ యను వారలు కలరు.

ఈ ఏకైక పుత్రునకు కోటీశ్వరాచార్యులు యుక్తప్రాయమున నుపనయన సంస్కారము లొనర్చి సనాతన పద్ధతిన నింటి వద్దనే చదువు చెప్పి, స్వర్ణ శిల్పము, శిల్పయోగ విజ్ఞానము, వైశ్యకర్మణ భక్తి కుమారునిలో సంకురింప జేసినారు. కోటీశ్వరచార్యులు తమ కుటుంబమును "సంగం జాగర్లమూడి"కి మార్చినాడు. అచట వైదిక సంస్కార సంపన్నులైన అద్దంకి సంగయ్యగారి కుమారులు శ్రీ వరదాచారిగారు మరియు బ్రహ్మయ్యగారుల వద్ద వేదాభ్యాసము, శిల్ప విద్య కాంస్య, పిత్తళ దేవతా విగ్రహాదుల నిర్మాణము మున్నగునవి కుమారరాఘవునకు అభ్యసింపజేసినారు. వివాహోపనయనాదుల విద్య, మంత్రపుష్ప పురుషసూక్త విశ్వకర్మ సూక్తాదుల నచటనే అభ్యసించినారు. ప్రాథమిక దశలోనే ఇట్టి విజ్ఞానమొసంగి భారత రామాయణ భాగవతాది ఉద్గ్రంథము లర్థయుక్తము పఠింప జేసి, శ్రీనాథకృత నైషధాది కావ్యములు, కృష్ణరాయల విష్ణుచిత్తీయము, అల్లసానివారి మనుచరిత్రము, భట్టుమూర్తి వసుచరిత్రము, టంకసాలవారి కవికర్ణ రసాయనము, రుద్రకవి నిరంకుశోపాఖ్యానము మొదలుగాగల ప్రబంధకావ్యములెల్లను చదువంజేసి కుమారుని కవిత్వ రచనకు దోహదమొసంగినారు. ఇట్లే సాహిత్య వాఙ్మయముతోపాటు బ్రహ్మజ్ఞానమునకై "హఠయోగ ప్రదీపిక" వంటి యోగ విద్యా గ్రంథములు చదివించి, కుమారుడు తనవలెనేగాక తనకన్న మిన్నయై ప్రకాశింప వలెననెడి ఉత్సుకతతో తత్త్వోపదేశము కూడా చేసినారు. సజ్జన సహవాసమున జనులు సద్గుణ వంతులగుదురన, సంపూర్ణ సౌజన్య మూర్తియును, తత్త్వజ్ఞానజ్యోతియునునైన కోటీశ్వరులకు, శంకరునకు స్కందునివలె జన్మించిన వీరరాఘవచార్యుడు,

ఆ కుమారునంతటి వాడుకాకపోవునా! అంతటి వాడౌట చేతనే వేదాది శిల్ప దర్శనములు రచింప కల్గినాడనుటలో వింతయేమి?

## వీరరాఘవుని వివాహము

విశిష్ట విజ్ఞాన గుణగణ్యుడగు వీరరాఘవచార్యుడు బాల్యము నుండియే సత్య, శౌచ, సమతాభావ సంపత్తితో నిజధర్మ కళాభ్యాస మునందు ప్రజ్ఞాధురీణుడైయును, శరీర సౌష్టవమును గూర్చి సాము నైత మభ్యసించి పటిష్ఠతర శరీరుడై నూత్నయౌవనరూప లావణ్య విలాసియై వెలయు చుండెను. అది కని కుమారుడు వివాహమునకు యోగ్యుడైనాడనియే గాక సంసారము నడుపుట కింటిలో నాడు వారె వరు లేరని భావించి కోటీశ్వరాచార్యులు మంగళగిరి వాసియైన కోట యాచార్యుల పుత్రికతో పద్దెనిమిదేండ్ల ప్రాయమున నుద్వాహ మొనర్చిరి

మంగళగిరి కోటయాచార్యులు శివభక్తుడు. ఇంటిపేరు "ఇంకోలు" వారు. వీరి పుత్రిక సుకుమారి. విద్యావినయ సంపన్న, కులీనవం శోదధి నుదయించిన పద్మజయనదగు "రాజరాజేశ్వరి" నామక. "వివాహో విద్యనాశయ" అను నీతిని గ్రహించిన వాడ య్యును వీరరాఘవాచార్యుడు తన కక్కాలమున నుద్వాహమొంద నిష్టము లేకున్నను, తండ్రిగారి యభీష్టమున కెదురాడని వాడగుట వలన వివాహమునకై తల యొగ్గినాడు. ఇదియేకదా! పితృభక్తియన.

సతీపతులన్యోన్య ప్రణయరాగాను బద్ధులై, ప్రద్యుమ్నను ద్యుమ్న ప్రసూనాంబకములకు ఓటమిచెంది స్వైరవివాహాదులుగాక సల్లక్షణ, సద్ధర్మ దాంపత్యము సలుపు చుండిరి. ప్రణయానంద డోలికలలో నూగుచుండియును వీర రాఘవాచార్యులు తమ విద్యాభి

వర్ధక ధ్యేయమును విడనాడలేదు. జనక బోధిత శాస్త్రాదు లభ్య సించుటచే కల్గిన సంస్కృత పరిజ్ఞానమునకు తృప్తిచెందక ఇంకను నభివృద్ధిపరచు కొనవలయు ననెడి కుతూహలం మాతనిలో పెరుగు చునే యుండెను.

## వీర రాఘవాచార్యుల గీర్వాణ భాషాభ్యసనము

మనోబుద్ధి చిత్తోత్ప్రేరణమున సంస్కృత భాషాభ్యాసము చెయుటకు నిశ్చయించుకొనినవారై యొక సుముహూర్తమున వీర రాఘవాచార్యులు కోపల్లెనుండి తెనాలికి పయనమై, గీర్వాణమునం దపార ప్రజ్ఞాన్వితుడును, విద్వజ్జన శిఖామణియును, వైదికాచార నిరతుడును బ్ర॥శ్రీ॥ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి వద్ద కేగి వినమిత శీర్షుడై యిట్లు విన్నవించెను. "ఆర్య వర్యా! నమోవాకంబులు! మీకు చిరమిత్రులును నస్మత్పితృపాదులు శ్రీకొండూరు కోటీశ్వరాచార్యులవారి కుమారుడను. నన్ను వీర రాఘవాచార్యుడని పిలుతురు. తండ్రిగారు నాకాంధ్రమునందు కొంత పరిచయము కలిగించినారు. ఐనను ఇపుడు గీర్వాణ భాష నభ్యసింపవలయునను కుతూహలము కల్గినది. ఆ కోరిక తీర్చుకొనుటకై మీ శిష్యత్వము నర్థిచెంద నభిలషించి మీ సన్నిధిని చేరినాడను దయాంతరంగులై మీ ఛాత్రులలో నొకనిగా స్వీకరింతురని ఆశించుచున్నా"నని ప్రార్థించెను. శ్రీభట్లుగారీ యువకాచార్యునిలోని జిజ్ఞాసకు మెచ్చి సాధారణముగా నీ కాలపు యువకులు తమ జీవనోపాధిక లౌకిక విద్య లభిలషింతురేకాని, యీ యువకుడు మాత్రము సంస్కృతము నభ్యసించుట కుత్సాహ పడుటకడు చోద్యమని సంతసించి శిష్యత్వ మొసంగి సంస్కృతము బోధించుటకు సమ్మతించిరి. అపు డా యువక వీరరాఘవాచార్యుడానంద కంబళితహృదయుడై 'శుభస్య శీఘ్రం'బను నీతి ననుసరించి ఆనాటి నుండియే గీర్వాణ భాషాపఠన మారంభించెను.

నాటినుండి అనుదిన మింటివద్ద ఉషఃకాలమున మేల్కాని గురువుగా రిచ్చిన పాఠములు పఠించి, తత్పరి జనకబోధిత యోగాభ్యాసకార్యములు, నిత్యనైమిత్తికాచార విధులు పూర్తిచేసి దధ్యోన్నము భుజించి తెనాలికి పాదచారియై వెళ్ళుచుండెడివాడు. శిష్యు అధ్యయనమున కభిమానపడి త్రిపురారి భట్లుగా రాతనితో నొకప్పుడు "పూర్వాచారము లడ్డురామిచో మాయింటనే నిలచి మాతోపాటు భుజించి చదువు కొనరాదా!" అని అనగా నీ వీరరాఘవుడు ప్రత్యుత్తర మేమియు నొసంగక లజ్జావనతవదనుండై యూరకుండెను. గురువుగారు నైతమంతటితో నొత్తిడిసేయక నూరకుండిరి. మధ్యాహ్న భోజనము, తెనాలిలోని కందుకూరి నాగమ్మ గారి అన్న సత్రమున చేయుచు సాయంత్రము వరకా త్రిపురారిభట్ల వద్ద పాఠములు గొనుచు అర్ధ తాత్పర్య విశేషములు సంగ్రహించి ఇల్లు చేరెడివాడు. మరుసటి దిన మాపాఠము లొప్పజెప్పి క్రొత్త పాఠములు గొనెడివాడు.

అచిరకాలముననే వీరరాఘవాచార్యుడు కవికుల తిలకుడైన కాళిదాస మహాకవికృత రఘువంశము, మేఘసందేశము, కుమార సంభవమనెడి కావ్యత్రయమును, కృతులయందర్ధ గౌరవఖ్యాతి గడించిన భారవి విరచిత కిరాతార్జునీయము, మరియు కావ్య రచనా లక్షణములం దలఘుడైన మాఘుని శిశుపాలవధ యనునదియు పఠించిపంచ కావ్యములందు ప్రావీణ్యత సంపాదించెను. ఈ కావ్యములందలి అలంకార లక్ష్యలక్షణములను, కావ్య తత్త్వములను నవగాహన మొనర్చుకొని "నైషధం విద్వదౌషధం"బని ప్రసిద్ధిగాంచిన శ్రీహర్షకృత నైషధమును పఠించెను. అలంకార శాస్త్రధురీణుడగుటకుగాను త్రిపురారిభట్లుగారు "చంద్రాలోకము," మరియు "కువలయానంద"ము మున్నగునవి బోధించిరి.

గృహమునందెంత శాస్త్రజ్ఞాన మార్జించినను పట్టభద్రుడై నంగాని ఈకాలమున లోకము గుర్తింపజాలదని భావించి త్రివురారి భట్లు శిష్యుని భావిశ్రేయస్సుగోరి, తాము సంస్కృత కళాశాల ఉపాధ్యక్ష (Vice Principal) స్థాన మధిష్ఠించియున్న వారగుటంచేసి వీరరాఘవాచార్యులం కళాశాలలో నుభయ (ఆంధ్ర - సంస్కృ) భాషా ప్రవీణోన్నత ప్రవేశ పరీక్షలో చేర్పించినారు. ఆ ప్రణాళిక (Course) రెండేండ్ల వ్యవధి కలది గురువుగారి వాంఛ ఫలవంతము చేయుటకై ఆ కోర్సు నొక సంవత్సరముననే పూర్తిచేసి ప్రశంసలు నందినాడు, వీరరాఘవుడు.

కళాశాల మహోపాధ్యాయులు "ధ్వన్యాలోకము," "రస గంగాధర" మను అలంకార శాస్త్రము బోధించెడివారు. మరొక ఉపాధ్యాయులు శ్రీ రామమూర్తిగారు "సిద్ధాంత కౌముది" మరియు వ్యాకరణము నేర్పుచుండిరి. బోధిత విషయ శాస్త్రము లందన్నింటను వీరరాఘవాచార్యుడు సాటిలేని రత్నముగా నెగ్గుటచే నధ్యాపక వర్గము యొక్క ప్రశంసలకు పాత్రుడైనాడు. శ్రీ శరభాచార్యులను నొకకవి వనితంనుడీ రాఘవుని "అనర్ఘరాఘవు"డని వాకొనిన నది ఈనాటికొక బిరుదవాచకమై వెలసినదని చెప్పవచ్చును. ఆంధ్ర సాహిత్య పరిజ్ఞానమెల్ల తండ్రికడనే సంపాదించిన కతమున నీ అనర్ఘరాఘవుడు కళాశాలలో తెలుగు పఠించనే లేదని చెప్పవచ్చును. కేవలము తరగతిలో నున్నాడనుటకే వెళ్ళెడి వాడనితోచును. సంస్కృతముననే అధికముగా శ్రద్ధవహించి అందులో నెనలేనివాడై "ఉభయ భాషా ప్రవీణ" పట్టము నార్జించి విజేతయైనాడు. తన విద్యార్థి దశనుండియే రాఘవాచార్యులు కాశీ నుండి వెలువడెడు "సూర్యోదయ" యను పత్రికకును, అయోధ్య నుండి వెలువడు సంస్కృత పత్రికకును గద్యపద్య వ్యాసాలు వ్రాసిపంపెడివారు. క్రీ.శ. 1938 లో అయోధ్య

సంస్కృత పరిషత్తువారు "విద్యాధురీణ"యను బిరద మొసంగి గౌరవించి నారనిన వీరి సంస్కృత భాషాజ్ఞానమెంత విస్తృత గన్నదో ఆలోచింపుడు.

## ఆచార్యులవారి సమతా భావము

విద్యార్థిగానుండు కాలమునందే ఈ రాఘవాచార్యులు వేదాంత తత్త్వాభిరుచి కలిగియుండుటంజేసి 'సర్వదర్శన సార సంగ్రహ సాంఖ్యయోగా"ది దర్శనములు మరియు ఆది శంకరుల విరచిత "బ్రహ్మసూత్రేత్యాది" భాష్యములు పఠించి పరతత్త్వజ్ఞానభివృద్ధి చేసికొన గలిగినారు. తెనాలి నగర జైనశ్వేతాంబరమఠము నందు గల జైనధర్మవిశేషములను పఠించి, తన్మహత్వమును ఆకళింపు చేసి కొన్నాడు. ఒకప్పుడొక జైనసన్యాసితో కలిసే అవకాశము కల్గినపుడా చార్యులు సంస్కృత భాషలో తనను గూర్చి తెలిసికొని, సంస్కార విశేషముల గూర్చి సంభాషించుచు బ్రహ్మ సూత్రములు చదివి వాని భావమును తెలుప నా జైన సన్యాసి వీరి గీర్వాణ భాషా పాటవమునకు, తత్త్వవిజ్ఞతకు ముగ్ధుడై సకల మతముల సారమొకే యొక "సత్య"మను సిద్ధాంతమును గ్రహించినారు. జైన ధర్మావలం బియయ్యును, బ్రహ్మ పదార్థమనునది 'సత్య' సిద్ధాంతము నుండి తెలియగలమను శ్రీ శంకర బ్రహ్మసూత్ర భాష్యమునుకూడ ఆ సన్యాసి పఠించి గ్రహింపగల్గినాడట. ఇది ఆచార్యులవారి విషయ జ్ఞానప్రభావము.

వీరరాఘవాచార్యుడు సర్వమత సమతా - సామరస్య దృష్టిచే క్రీస్తు ప్రదర్శిత "సహన" భావ ప్రభావమును బైబిలుద్వారా గ్రహిం చినాడు. మహమ్మదీయ మతముయొక్క ఉత్కృష్ట గ్రంథరాజ మగు "ఖురాను"కూడ పఠించి తన సమతాబుద్ధికి మరింత వన్నె పెట్టినాడు.

## జాతీయోద్యమాభినివేశము

ఆకాలమున క్రమముగా వీరరాఘవాచార్యులు విద్యార్జన సంపూర్తి చేయక మునుపే వార్తాపత్రికలు చూచుట కవకాశము కల్గియుండున స్వదేశ, విదేశ వార్తావాహినిద్వారా లోకజ్ఞాన మినుమడింప చేసికొన్నారు. స్వదేశాభిమాని యగుటవలన నాడు దేశమున సాగుచున్న స్వతంత్ర - జాతీయోద్యమ వార్త లాచార్యులవారి నాకర్షించినవి. మహాత్మాగాంధిగారు దక్షిణాఫ్రికాలో నారంభించిన సత్యాగ్రహోద్యమముపై వీరికభిమానము కల్గినది. హృదయము పులకలెత్తినది. తమ విద్యార్థులలో కూడ జాతీయాభిమాన బీజము లంకురింప జేసినారు. భారత దేశమునకు గాంధీగారు తిరిగి వచ్చి దేశ స్వాతంత్ర్యమునకై చేయు ఉపన్యాస విషయ వార్తలు పత్రికలలో చదువుటచే నవి వీరిను త్తేజపరచినవి. గాంధీగారు చేయబోవు ఉప్పు సత్యాగ్రహమును పురస్కరించి, తెనాలిలో కన్యకాపరమేశ్వరి ఆలయమున, స్థానిక నేతలలో నగ్రగణ్యులైన మహమ్మదిస్మాయిలు, ఖద్దరు సాహెబు, శ్రీరాచకుళ్ళచెంచయ్యగారి వంటివారు ఆంధ్రదేశమున (నాటి మద్రాసులోని)కూడ, సత్యాగ్రహమున కంకురారోపణముచేయ నొక సభ ఏర్పాటు చేసినారు. ఆ సభలో వృద్ధ వయస్కులేగాక యువక విద్యార్థులు సైతము భాగస్వాములైనారు. అపుడీ రాఘవాచార్యుడును నొక వక్తగా సభనుద్దేశించి, సత్యాగ్రహోద్యమ లక్ష్యసాధనకై "అహింసాత్మక" - లక్ష్యము కలిగియుండుట అత్యావశ్యకమని, ఉపన్యసించి సహచరులలోను, విద్యార్థులలోను దేశాభిమానము కల్గించినాడు. ఇది రాఘవాచార్యుల తొట్టతొలుతటి రాజకీయపరమైన ఉపన్యాసమేయైనను, "దేశము, దేశీయులకు ఆత్మవంటిదని, ఆత్మయుండిననే దేశవాసులకు విచ్ఛిత్తియుండదని, ఆత్మను నిలుపు

కొనుటయే భక్తి యనబడునని తత్త్వజ్ఞానములో దేశభక్తిని అను సంధానించి జనమును మేల్కొల్పినాడు."

ఆనాడే వ్యక్తియేని స్వాతంత్ర్యోద్యమ సత్యాగ్రహములలో పాల్గొనినను, పాల్గొనకపోయినను కేవలము ఖద్దరు వస్త్రములు ధరించినంత మాత్రమున వానిని ప్రభుత్వము దేశద్రోహ నేరమున కారాగారమున వేసెడిది. సభా నాయకులగు ఖద్దరు సాహెబు మహమ్మదిస్మాయిలువంటి పెద్దలనందరిని ప్రభుత్వము నిర్బంధము లోనికి తీసికొనినది. మరునాడు సంస్కృత కళాశాలకు పోలీసులు వచ్చి విచారించి నీయువక వీరరాఘవునిని విద్యార్థిగానెంచి నిర్బం ధించలేదు. బంధితులకు కల్గిన శ్రీకృష్ణ జన్మస్థాన భాగ్యము తనకు లభింపకపోయెనని విచారపడినా డీయువక దేశభక్తుడు.

## శ్రీనిరంజన శాస్త్రిగారితో సాహచర్యము

వీరరాఘవాచార్యులు స్థిరమగు నుద్యోగము లభించువరకు తమ కాలమును వ్యర్థ పుచ్చలేదు. కార్య నిమగ్నతయే కర్మిష్ఠుల లక్షణముకదా! తండ్రిగారి వద్ద సంపాదించిన శాస్త్ర విజ్ఞానధనముచే. కళాశాలయం దార్జించిన సాహిత్య విత్తమువలన, తమ హృదయ భాండాగారము పూరించలేదనియో, కాక ధనవంతుడింక ధనికుడు కావలెనను లోకవాంఛ ననుసరించియో తృప్తినందక, శాస్త్రాభివృద్ధి చేసికొనవలెనను కోరికచే, సకలాగమ శాస్త్ర విజ్ఞాన ఖనియు, విశ్వ బ్రాహ్మణ వంశాగమ ప్రణీతయు, దుగ్గిరాల వాస్తవ్యులునైన బ్ర॥శ్రీ॥ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి సన్నిహిత శిష్యత్వ సాహచర్యముం బొంది జ్యోతిశ్శాస్త్ర లక్షణములు, వాస్తుశాస్త్ర వివరములు, వేద, శిల్పశాస్త్ర విశేషములు, వైశ్వకర్మణ్య రహస్యములు సోప పత్తిక ముగా సముపార్జించి జ్ఞాన భాండాగారమును నందిపగనునారు.

ఆచార్యులవారు 1938 లో "శ్రీనిరంజన విజయ" మను పేరుతో శాస్త్రిగారి జీవిత చరిత్రము వ్రాసి, గురుదక్షిణగా సమర్పించి ఋణము తీర్చుకున్నారు. "విద్యాతురాణాం నసుఖం న నిద్రా" యను నీతి వచనము వీరిపట్ల నూటికి నూరుపాళ్ళు అన్వయించును. (కావుననే తమ వార్ధక్యమును సైతము వ్యర్థపుచ్చక వేదములను క్షుణ్ణముగా దర్శించి దర్శనాచార బిరుదాంకితులైనారనుటకు వారి యోగ, శిల్ప, ఋగ్యజురాది, తత్త్వ దర్శన రహస్య గ్రంథములే నిదర్శనములు).

విద్యార్థిగా నున్నపుడే వీరికి శ్రీతత్త్వానందస్వామి మళయాళ స్వామి (వ్యాసాశ్రమము) వారితోను, మహా మాతృమూర్తులైన చిన్నమ్మ - పెద్దమ్మ మరియు పిచ్చమానధూత మున్నగువంటి యోగినీయోగుల సేవాభాగ్యము కల్గినది. వారి బోధనలచే నాచార్యుల వారు తమ ఆధ్యాత్మిక సంపత్తి నెంతో వృద్ధిపరచుకొన్నారు. శ్రీసముద్రాల లక్ష్మయ్యగారు శ్రీ మళయాళస్వామి చరిత్రము వ్రాయగా దానిపై నొక ఉత్కృష్టతరమైన తమ అభిప్రాయము నొసంగినారు. ఆచార్యులకు తత్త్వశాస్త్రమంటె ఎంతో అభిమాన మని ఈ విషయమునుబట్టి తెలియును. ఆస్తిక దర్శనాలతోపాటు నాస్తిక దర్శనాలుకూడ తత్త్వాసక్తితో చదివినారు. శంకరునిమీద తిరుగుబాటు ధ్వజమెత్తి, యొక నూతన మార్గమునకు దారి తీసిన అరవిందుని దర్శన సారాన్నికూడ పుడిసిలించుకొని వారి "Divine Life"ను చదివి, వారి అతిలోక ప్రతిభకు రాఘవాచార్యులు నివాళు లర్పించినారు. ఈ విధముగా జ్ఞానాభివృద్ధి గాంచుచుండినను ఆచార్యుల వారు తండ్రిగారి వార్ధక్య దశలో చేదోడుగా నార్థిక సహాయము చేయలేకుంటినికదా! యని చింతించుచు నుద్యోగాన్వేషణము చేయు చునే యుండిరి.

## ఉద్యోగ ప్రయత్నము

"కాళహస్తి" నగరమున గల ఉన్నత పాఠశాల యందాంధ్ర పండితోద్యోగస్థానము నియమింపబడవలసియున్నదని ఆ ఉద్యోగము విజయవాడలో పేర్గాంచిన శ్రీకట్టమంచి కోళిందరెడ్డిగారివలన లభించ గలదని వినిన వీరరాఘవాచార్యులతనినిదర్శింప విజయవాడకు వెళ్ళిరి సముచిత రీతి నాయనతో కలిసి తమ అభ్యర్థనము విన్నవించిరి ఆచార్యుల వారి భాషావిజ్ఞతపాటవమునకా కోళిందరెడ్డి గారు సంతసించి తక్షణమే కాళహస్తి విద్యాధికారి పేరిట నొక లేఖ వ్రాసి యొసంగిరి ఆ లేఖతో రాఘవాచారి గారు విద్యాలయాధికారి శ్రీనారాయణరెడ్డి గారిని చూచుటకై కాళహస్తి వెళ్ళిరి. ఆనాడా అధికారి మదనపల్లిలో నుండుట తెలిసి, ఆయన వచ్చు వరకు కాలసించుట ఉచితము కాదని మదనపల్లికి వెళ్ళి వారికా లేఖనందించి తమ విద్యాయోగ్యతలను విన్నవించి పట్టములను చూపిరి. నారాయణరెడ్డి గారా లేఖ చదువుచు లోలోన నవ్వుకొనుచు అభ్యర్థితో అయ్యా! ఆచార్యా! మొన్ననే ఆంధ్ర విశ్వవిద్యాలయ అధ్యక్షులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డి గారి ఆదేశమున నాస్థానము నందొక వ్యక్తి నియమింపబడినాడు. ఇపుడు నేనేమియు సేయలేమికి చింతించుచున్నాననియని మీ మండలములోనే ప్రయత్నించినచో నదేని లభించగలదని" సలహాపూర్వక జవాబిచ్చి పంపెను.

## దక్షిణ దేశయాత్ర

[రమణ మహర్షి దర్శనము 1938]

కాళహస్తి విద్యాధికారి జవాబు వలన నాశాభంగమైనను విని రాఘవాచార్యులు ధైర్యసాహసోపేత హృదయులగుటచే చింతింపక

ఏది జరిగినను దైవేచ్ఛతోనే జరుగునని భావించి వెనుదిరుగుచు, నచటి కనతి దూరమున శ్రీరమణ మహర్షి యాశ్రమ ముండుట విని శ్రీవారి దర్శనాసక్తిచే నచటికి తమ ప్రయాణము సాగించిరి.

శ్రీరమణ మహాఋషుల వారి ఆశ్రయము తమిళదేశములోని "తిరువణ్ణామలై"లో గలదు. శ్రీవారనుపమాన దయాసాగరులు, యతీంద్రులు, నిరంతర దైవ చింతనా మనస్కులు, మితభాషులు, సుస్మిత వదనారవిందులు. ఆశ్రిత జనుల నాదరించి వారి హృదయ వాంఛల నెరింగి సానుకూలముగా సంభాషించెడి మహాత్ములు. కలి కాల జనోద్ధరణకై శ్రీరమణీ రమణుడే అలనాటి నారాయణ ఋషిగా నవతరించిన, భగవత్స్వరూపులుగా దర్శన మాత్రమున భక్తజన "మాయాంధకారమును" పటాపంచలొనర్ప గల ప్రభాకరులు. ఇట్టి వారిని దర్శించుటకై వీరరాఘవాచార్యులు -1939లో తిరువణ్ణామలై వెళ్ళినారు.

శ్రీవారిని దర్శించుచునే తచ్చరణారవిందములకు సాష్టాంగ నమస్సులర్పించి సంస్కృతభాషలో తమను గూర్చి పరిచయము తెల్పికొనిరి ఆచార్యుల వినయ వినమ్రతలకు మహర్షులర్థించి ఆశీర్వదించిరి. అది వారిరువురి అంతరంగిక గోష్ఠి మాత్రమేయని ఆచార్యులు గారంటారు.

ఆ యాశ్రమమున నీయువక రాఘవాచార్యులు 3 దినములుం డిరి. ఆకాలము నందొకనాడు శ్రీరమణులు భక్తులతో గూడి భోజనము చేయు సమయమున రాఘవాచార్యులు,కొద్దిపాటి విలంబనతో పంక్తిలో జేరవచ్చు వరకు స్థలము లేమికి సంకోచించుచుంన ఋషి వర్యులది గ్రహించి తమ ప్రక్కన గల ఆసనద్వయము నందొక పీఠమున

గూర్చుండ బిలిచిరి. హర్షపులకాంకిత హృదయులై యీ ఆచార్యులు శ్రీవారి ప్రక్కన గూర్చుండిరి. రెండవ పీఠమున నొక జర్మను దేశీయుడు కూర్చుండెను మహర్షి ప్రక్కన గూర్చుండి భుజించు భాగ్యము కలిగినందులకీ యువకాచార్యులెంతయో ఆనందించి ఇది తమ సుకృత ఫలమేయని భావించి స్వామి వర్యులకు నమస్కరించి ధన్యజీవులాయెను.

## కంచి కాళహస్త్యాది క్షేత్రదర్శనము

శ్రీరమణ యోగీంద్రుల ఆశీస్సులు బడసిన యానందములో నాచార్య కొండూరు "పుదుచ్చేరి" (పాండిచ్చేరి) యందలి శ్రీఅరవిందాశ్రమము దర్శించ నిచ్చగించిరి. కాని ఒక మహాశయుడు "శ్రీఅరవిందుల వారేడాదికొక పర్యాయమే తమ యోగసమాధి నుండి ప్రకటితులై దర్శనమిచ్చెదరు. ఆ సమయము దాటి పోయినది అని తెలుపగా నా ప్రయాణము విరమించుకొని మద్రాసు వెళ్ళినారు. అచటి విశేషములు తిలకించి అటు నుండి దేశమున ప్రసిద్ధమైన మహాబలిపురము వెళ్ళి అచటి సనాతన జైన తీర్థంకరుల మహోజ్జ్వల ప్రభలీను మహోన్నత విగ్రహ శిల్ప సృజనాచాతుర్యమును గాంచి అచ్చెరు వంది శిల్పాచార్యులకు వందనములర్పించి, తదనంతరము కాళహస్తి, కంచి మున్నగు క్షేత్రములు పర్యటించి, ఆయా స్థలములందలి ఆలయ నిర్మాణాది శిల్ప నైపుణ్యములకు, కళా విష్కృతవిగ్రహ సృజనాంతర విశేషములకు ముగ్ధులైన వీరరాఘవాచార్యులు ఆయా వివరములను సూక్ష్మ దృష్టితో పరికించి తమ హృదయ ఫలకమున శిల్ప విన్యాసములను ముద్రించుకొని భద్రపరచి వ్యాసాలరూపమున నొక గ్రంథమ్మును తర్వాతికాలమ్మున వెలువరించినారు.

## వ్యాసాశ్రమము

భాగవతమూర్తి తనూభవ వాగ్రగణ్యులలో ఖ్యాతిగాంచిన ఆధునిక యోగీశ్వరులు శ్రీమళయాళస్వామి బిరుదాంచితులగు గురు పరివ్రాజకవర్యుల వ్యాసాశ్రమమును దర్శించుట కుత్సుకులై వీరరాఘవాచార్యులు "ఏర్పేడు" గ్రామమునకు ప్రయాణ మొనరించిరి. స్వాములవారు మళయాళ ప్రాంతోద్భవులయ్యును, మళయాళస్వామిగా ఖ్యాతిగడించినను శ్రీ వారి తత్త్వబోధామృతము గ్రోలని భారతీయుడు విశేషించి ఆంధ్రుడు లేడనిన నతిశయోక్తికాదు. "శుష్కవేదాంతతమోభాస్కర" మనునది శ్రీవారి అనుపమాన గ్రంథము. వీరు అసంగానందయతీశ్వరులని కూడ సుప్రసిద్ధులు. శ్రీ వారే "వ్యాసాశ్రమ" సంస్థాపకులు. ఈ యాశ్రయము నందనేక పండిత ప్రకాండులు విద్వద్వరిష్టులు శ్రీవారికి శిష్యులై, ఏతత్తత్త్వ బోధ ప్రకాశమొనరించుటకై అనేక స్థలములందాశ్రమములు వెలయించినారు. అట్టివానిలో నొకటి తెనాలిలోను కలదు. అది "ఓంకారాశ్రమ" మని వ్యవహరింపబడు చున్నది. అద్దానిని శ్రీ కాకునూరి శ్రీరాములు గారు నెలకొల్పినారు.

ఈ ఓంకారాశ్రమ వార్షికోత్సవమున కొకపర్యాయము శ్రీమళయాళస్వామి యతీశ్వరులు వేంచేసినపుడే మనవీరరాఘవాచార్యులు శ్రీవారిని దర్శించు భాగ్యముగాంచినారు. ఆనాటి వార్షికోత్సవ సభలో నీయువక వీరరాఘవు లుపన్యసించి స్వామి వారికి ఆదర పాత్రులైనారని చెప్పుదురు. అట్టి పరిచయమును పురస్కరించుకొని ఇపుడు వారి దర్శనాభిలాషియై వ్యాసాశ్రమునకు వెళ్ళినారు.

ఆశ్రమమును దర్శించి రెండు దివసములటనిలిచి, అచటి "యధార్థభారతి' అను పత్రికా ముద్రణాలయము, ఆశ్రమందలి "ప్రాచ్యవిద్యాబోధనాలయము, అచటి క్రమశిక్షణా విశేషము లారసి

ఆశ్చర్యచకితులైనారు అక్కడినుండి తత్సమీపమునందలి "మడుగు" శ్రీస్వాములవారు తపోనిష్ఠయందున్నారని తెలిసి అచటికేగి వీర రాఘవాచార్యుల స్వామి వారిని దర్శించి భక్తితో నొక కదళీఫల మర్పింప శ్రీవారాశీస్సులొసంగి దీవించిరి.

## శ్రీగాయత్రీ పీఠాధిపతుల ఆదరప్రాప్తి

ఇట్లు వీరరాఘవాచార్యులు మడుగు స్వామిచే ఆశీస్సులంది ప్రహర్షులై మైసూరు మహానగరమును చూడనభిలషించి బెంగుళూరు వెళ్ళినారు. ఆకాలమున విశ్వకర్మ జగద్గురు గాయత్రీ పీఠాధిపతులు మైసూరు రాష్ట్రమున పర్యాటనము జేయ సమకట్టి యుండిరి.

ఈ గాయత్రీ పీఠము భారతావని యొక్క విశ్వకర్మ జగద్గురు పీఠపంచకములగు గాయత్రీ - సావిత్రీ-సరస్వతీ, శచీ - సంజ్ఞ - నామాంచిత సింహాసనములలో నిది ఒకటి. గాయత్రీ పీఠాధి పతులుగా శ్రీపీఠూరివారు.[1] ప్రఖ్యాతులు. ఈ సంస్థానమునకు శ్రీకొండనాచార్య స్వాములు సావిత్రీ ప్రథమాచార్యులు. పీఠాధిపతులు శ్రీకనుపర్తివారు. ఈ పీఠమున కాద్యాచార్యులు శ్రీభ్రమరాచార్య స్వాములు. సరస్వతి పీఠమునకు ఆద్యాచార్యులు శ్రీమద్రూఢాచార్య స్వాములవారు ఈ పీఠము ఆనెగొంది, హంపీ విజయనగర సంస్థాన శ్రీ కాళహస్త్యాచార్య ప్రణీతము.[2] శచీ సంజ్ఞా పీఠముల ఆచూకీ ప్రకృతము అదృశ్యముగా తోచుచున్నదనిన సాహసమే కానగును. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు తమగ్రంథములం దొకచో ఈ విషయము నుటంకించినారు.

ఉదాహృత పీఠత్రయములోని శ్రీ గాయత్రీ పీఠాధీశులు పీఠూరి వంశార్ణవ చంద్రులు శ్రీవేంకటాచార్య స్వాములు, ప్రకృతము

---

1) ఆంధ్ర విశ్వకర్మ పురాణము అవతారిక చూడుడు. (2) మత్కృత 'మన పీఠము' చూడుడు.

మైసూరు రాష్ట్ర సంచారము చేయతలపెట్టినారు. ఆ తరుణమున (1939లో) మన కొండూరు వీరరాఘవాచార్యులు పీఠాధీశ్వరులను దర్శించి పునీతులైనారు. వీరి విద్యావిశేషప్రతిభలకు స్వాముల వారాకర్షితులై తమ ఆస్థాన పండితులుగా నుండగోర రాఘవా చార్యులు గురుసన్నిహిత సౌభాగ్యమునకుప్పొంగి పులకాంకితాంగులై ఒక మాసము దివసములు గాయత్రీదేవి నిత్యార్చన ప్రవచనాదులలో స్వాముల వారితో పాటు పాల్గొనుచుండిరి. ప్రవచనాదిక ఉపన్యాసము లందు రాఘవాచార్యులు విశ్వకర్మ యొక్క విశ్వకర్తృత్వో న్నత్యమును శ్రుతి సూక్తోపనిషత్ప్రమాణములతో దృఢపరుచుచు వేలాది ప్రజానీకమును ముగ్ధులను చేయుచుండెను. భారతదేశ విశ్వ కర్మ వంశోద్భవుల పూర్వ వైభవమును, పూర్వపు శిల్ప విజ్ఞాన చతురతను సోపపత్తికముగా నుగ్గడించుచుండెను. కొందరు, "విశ్వకర్మ పరమాత్మను" తమ సంకుచిత దృష్టితో కేవలము పంచ శిల్పాచార్యులచే తమ దేవుడుగా కల్పించుకొనిన వారి పాక్షిక దేవుడు మాత్రమని, సర్వదేవోన్నతుడు కాదనెడి యే అపోహలో నుండిరో-ఉన్నారో అట్టివారి భావమును త్రోసిపుచ్చి "విశ్వకర్మ" విశ్వమును సృజించిన పంచానన పరబ్రహ్మయేయని వేద ప్రమాణ పూర్వకముగా విశదీకరించుచుండెను.

మైసూరు రాష్ట్రములో శ్రీరాఘవేంద్రస్వామి ప్రభావం అధికము గానున్నది. ఆ మతస్థులు ద్వైతులు. మన ఆచార్యు లుపసించునది ద్వైత విశిష్టాద్వైతాలను నిరసించని మహాద్వైతం, ఐనను వీరి వక్తవ్యము వినుటకై వేల సంఖ్యలో జనం వచ్చి ఆనందించేడిది. బెంగుళూరు నుంచి శైవ పీఠాధిపతులు సైతము వచ్చి ఏకాంతంలో వీరితో ప్రసంగించి సందేహనివృత్తు లయ్యేడి వారని విశ్రుతము.

ఇక గాయత్రీ పీఠమహత్త్వమును నుగ్గడించుచు "గాయత్రి" మూల విశ్వకర్మ పరాత్పరుని ప్రతి బింబమని వేదాధారములలో బలపరచి, పురాణములందే ప్రకృతి పురుషులు యొక్క యే వర్ణన కలదో అప్రకృతి పురుషులే గాయత్రీ విశ్వకర్మలని సువ్యక్తపరచి పురుషుని యొక్క ప్రతిబింబమే "ప్రకృతి" యగుటచే నభిన్నులగు నట్టులే గాయత్రీ విశ్వకర్మలు అభిన్నులే గాక సృష్టి నిర్మాణ పోషణాదు బేలంద భేదులని వేధము వచించు ప్రమాణములతో వివరించినారు.

ప్రకృతియే ఆది, పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులుగా వర్తిల్లినదను పురాణోక్తి కాధారమైన యీ గాయత్రీ శక్తియే సావిత్రీ సరస్వత్యాది పంచశక్తులుగా, పంచమాతృకలుగా ఉద్ఘోషించినారు. ఈ గాయత్రీ విశ్వకర్మ లే - ప్రకృతి పురుషులె-సృష్టి కర్మ మొనర్చిన అదిమ మహాశిల్పులని వ్యక్తపరిచినారు. అట్టి మహత్తరమైన గాయత్రీ పీఠము అని ఏతత్ ప్రాశస్త్యమును ఆచార్య కొండూరు వారు సుబోధపరచినారు.

బ్రహ్మసూత్రాద్యుపనిషద్గీతలందలి ఆధ్యాత్మిక తత్త్వసారమును కూడ విశ్రుతపరచి సభాసదులలో పరబ్రహ్మ చింతనాభిరుచి కల్గించి జనుని హృదయాంతర్తియైన "ఆత్మ" యనంబడునది విశ్వకర్మ యే యను శ్వేతాశ్వతరోపనిషన్మంత్రములలోని మహర్షుల వచనములతో సమర్థించి విశ్వకర్మ మహత్తును నుగ్గడించినారు.

ఇట్టి సభలో మైసూరు రాష్ట్ర సుప్రద్ధులును, అపర విశ్వకర్మగా పేర్గాంచిన శ్రీశ్రీసిద్ధలింగేశ్వరస్వాములీఆచార్యుల వాగ్ధాటికి విషయ విజత కారరితులై అనుదినము సభాపతితం పీఠం

అలంకరించుచుండెడి వారనిన నీ వీరరాఘవాచార్యుల ప్రతిభ యెట్టిదో పాఠకులూహింతురుగాక. శ్రీసిద్ధలింగేశ్వరస్వాములు మైసూరు రాష్ట్ర ఆస్థాన శిల్పాచార్యులుగా రాష్ట్రముచేతను, రాజుచేతను పూజితులైనవారు. ప్రభువులకు కుల గురువులు, మంత్రోపదేష్టలై బ్రహ్మతత్త్వ జ్ఞానామృతమొసంగిన పంచబ్రహ్మాత్మక మూర్తులు, వాస్తాగమ వేదవేత్తలు ఇంతటి మహామహులే మన ఆచార్యుల మధుర గంభీర భావ వక్తవ్యమును మెచ్చుకొనినారన నన్యుల గూర్చి చెప్పెడిదేమి?

## ఆచార్యులవారి నిరీహత

వీరరాఘవాచార్యుల విషయ విజ్ఞానార్ణవ వీచికలలో నుఱ్ఱూతలూగిన పండితాగ్రగణ్యులెల్లరు, విశేషించి యాజక చక్రవర్తులైన శ్రీచంద్రశేఖరాచార్యులు, స్వయము మహా విద్వాంసులయ్యును కొండూరువారి శాస్త్ర పరిజ్ఞానమునకు ముగ్ధులై ఆచార్యులగూర్చి ఒక సన్మాన సభ ఏర్పాటు చేయుట కాలోచించి నగర విశ్వబ్రాహ్మణ జన సుహృద్భావము ప్రకటించుచు స్వర్ణమణిమకర కుండములతో గౌరవింప నుద్యోగించిరి. కాని వీరరాఘవాచార్యులు నిర్గుణోపాసకులైన అద్వైతియగుటచే సన్మానము నత్యంత నమ్రభావముతో కుండలికష్టి చేసినవానికి కుండలములేల యని తమ నిరీహతను వెలిబుచ్చిరి. అందుకాయన సౌశీల్యమున కచ్చెరువంది యా సన్మాన సభలో నొక "అభినందన పత్ర"ము మాత్ర మొసంగిరి. అందులో నాచార్యులవారి నొక "గృహస్థ సన్యాసి" యని బహుభంగుల ప్రశంసించినారు. నవయౌవనముననే యిట్టి నిరీహతాభావమును కనబరచిన ఈ ఆచార్యు లిక ముందెంత గొప్ప తత్త్వజ్ఞులగుదురో ! యని సభాసదులెలగు ఆశ్చర్యము ప్రకటించినారు.

## విశ్వ బ్రాహ్మణ జనాభిమానము

ఉదాహృత చంద్రశేఖరాచార్యులుగారనేక యజ్ఞము లిది వరకే చేయించిన మహా యాజకులు, రాఘవాచార్యుల సత్కార సభానంతరము కొన్నాళ్ళకు శ్రీరంగ పట్టణమున పంచ బ్రహ్మల యజ్ఞములు నిర్వహింప బూనినారు. ఆ యజ్ఞములందు పాల్గొని జగత్స్రష్ట తత్త్వబోధ కోపన్యాసములు చేయ చంద్రశేఖరాచార్యులు మన కొండూరి వారి నాహ్వానించిరి. ఆ తరుణమున నీ ఆచార్యుల వారి సతి రాజేశ్వరమ్మగారు, కొమరిత స్వరాజ్యలక్ష్మి, శ్వశురులు కోటాచార్యులు కూడ ఆహూయమానులైరి.

అపుడు పంచ బ్రహ్మలెవరు ? వారు నవబ్రహ్మలలోనివారా ? లేక త్రిమూర్తులవలె దేవాధిదేవతలా ? అట్లు కానిచో నీ పంచ బ్రహ్మలగూర్చి యజ్ఞములు సేయుట వేద సమ్మతమేనా ? యను కొందరిలోని సందేహములను దూరీకరించుచు పంచబ్రహ్మలు విశ్వకర్మ పంచాననోద్భవులైన ఆదిమ స్రష్టలని, వీరి వలననే పంచ భూతోత్పత్తి జరిగినదని, వీరిని గూర్చి ఋగ్వేదమున ప్రథమ సూక్తమున ప్రథమ అనగా తొలి ఋషులుగా వర్ణింపబడిన విషయము విశదపరచి వీరే విశ్వ నిర్మాణ దక్షులైన జగచ్ఛిల్పులుగా వక్కాణించి తత్ప్రాధాన్యతను వివరించినారు.

యజ్ఞానంతరము వీరరాఘవాచార్యులు సతీ, సుత, శ్వశుర సమేతము చంద్రశేఖరాచార్యుల సహకారముతో మైసూరు రాష్ట్ర మందలి దర్శనీయ స్థలములు, రాజభవనాది నిర్మాణములు దర్శించి అటుపై శ్రావణ బెళగోళయందలి సుప్రసిద్ధ "గోమటే"శ్వరుని మహోన్నత విగ్రహ శిల్పము, బేలూరు చెన్నకేశవాలయ శిల్ప విశేషములు తిలకించి ఆయా శిల్ప లక్షణములను నిశిత సూక్ష్మ

దృష్టితో నవగాహన మొనర్చి, పిమ్మట నాయా విషయ వివరణ ములతో "శిల్ప కళాక్షేత్రాలు" అను నొక గ్రంథముకూడ ప్రచురింప చేసినారు.

## ఉద్యోగము - శారదా నికేతనము

శ్రీ గాయత్రీ పీఠ సంస్థాన పండితాగ్రణి పదవిని పురస్కరించి శ్రీ కొండూరు వారింతవరకు సముపార్జించిన తమ విజ్ఞానానుభవ బలమున విశ్వకర్మ జాతి సంస్కృతీ సంస్మరణాభిమానిగా నొక గొప్ప వక్తయైనారు. మైసూరు రాష్ట్రమునందలి ప్రఖ్యాత స్థలములను పర్యటించి ఆయా ప్రదేశములలోని శిల్ప నిర్మాణ చాతుర్యములను పరిశీలించి ద్విగుణీకృత విజ్ఞానము నార్జించినవారై గృహోన్ముఖుడయ్యెను. కొంతకాల మింటనే విశ్రాంతి గొనియున్నను, "ఉద్యోగం పురుష లక్షణ"మ్మను మాట వారి హృదయమును వేధించుచుండెను. ఒకనాడు "శారదా నికేతనము" (ప్రాచ్య కళాశాల) మనసులో మెదలినది. తక్షణమే పయనమై యటకేగిరి.

శారదా నికేతనము, సంఘసంస్కరణమునకై, బద్ధకంకణులైన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారిచే స్థాపింపబడినది. లక్ష్మీనారాయణగారు తరతమ భేదములేని న్యాయవాది. అహింసావాది. అస్పృశ్యతాజాడ్యము నంతరింపజేయు ప్రతిన బూనిన సంస్కరణాభిలాషి వీరు విశ్వకర్మ పురోగమనాభిమానులు. ఇట్టి సద్గుణ సంపన్నుని కలిసినచో తమ ఉద్యోగవాంఛ తీరునని దలంచి వీరరాఘవాచార్యుడు శారదా నికేతనము జేరెను ఉన్నవవారు వీరరాఘవుని విద్యావిశేషజ్ఞతల నిదివరకే వినియున్న వారగుటంజేసి ఇతనిని గాంచినంతనే ఆప్యాయతతో స్వాగతము పలికి, లోలోపలనే ఈ ఆచార్యులు తమకు చేదోడు వాదోడుగా నుండగలరనియు, నికేతన

మున కెంతయో సహకారి యగునని యు భావించి శారదా నికేతన మున నధ్యాపకులుగా వీరిని నియమించుకొనిరి. వెదకబోయిన తీగె ఆచార్యుల కెదురువచ్చినట్లైనది. ఇక కావలసినదేమి ?

లక్ష్మీనారాయణ వీరరాఘవులుగారలన్యోన్య స్నేహముతో నన్నదమ్ములవలె, శరీరద్వయులయ్యు, హృదయైకభావ సామ్యముతో నా నికేతనమును సర్వవిధముల నభివృద్ధి పంథాలో నడిపింప సాగిరి. సాహిత్యక్షేత్రముననుు, తాత్త్వికభావ ప్రచారమునను నీ యిరువురొక్కతీరు నుండుటవలన, విద్యావిధానమున సనాతనాధునాతన పద్ధతులను మేళవించి పురోగమింప జేయుచుండిరి.

ఇట్లు కతిపయకాల మీ వీరరాఘవాచార్యులు శారదా నికేతనమున సంస్కృతాంధ్రోపన్యాసకులై పుంభావ శారదులుగా నధ్యాపకత్వమున వెలయుచుండ, గుంటూరు మండల (జిల్లా) బోర్డులో పండితులుగా నియుక్తులైనారు. అపుడు వారు తమ స్థానమును శ్రీకృపాచార్య విద్వాంసుల కొసగి నికేతనమునకు వీడ్కోలు పలికిరి. ఇది ఆచార్యుల త్యాగశీలతకు, పరోపకారత్వమున కొక మచ్చుతునక యనక తప్పదు.

## ఆచార్యులవారి అధ్యాపకత్వము

శారదా నికేతనోద్ధరణకు పూర్వము అనగా 1938 నుండి 1944 వరకు శ్రీకొండూరువారు "కావలి" "బుచ్చిరెడ్డిపాలెం" మున్నగు ననేక ప్రదేశములందాంధ్ర సంస్కృతాధ్యాపకులుగా ఛాత్రజన కల్పతరువై వెలసిరి. తెనాలిలో, శ్రీగోగినేని రంగనాయకులు, B. A. B. L. గారును, శ్రీ నన్నపనేని వేంకటరావు, మ్యునిసిపల్ చేర్మన్‌గారు ప్రభృతులచే నెలకొల్పబడిన కళాశాలయందాంధ్ర భాషా

బోధకులుగా నాహ్వానింపబడిరి. అచట ఆచార్యులు శిష్యగణాకర్షిత మహా బోధకులుగా ప్రఖ్యాతి గడించిరి.

1944 నుండి 1951 వరకు సత్తెనపల్లిలోని శ్రీ శరభయ్య ఉన్నత విద్యాలయములోను, 1952 నుండి 1972 వరకు V. S R. కళాశాలలోను ఆంధ్రోపన్యాసకులుగానుండి 1972 సెప్టెంబర్‌లో ఉద్యోగ విరమణ మొనర్చినారు

ఆకాలమున వీరు శ్రీ తుమ్మలవారి కృతులను, శ్రీ ఏటుకూరి వారి రచనలను సమగ్రముగా పరిశీలించి, వాటిని గురించి విమర్శనా వ్యాసములు ప్రచురించినారు. భోజరాజీయమను మహాకావ్యమునకు విపులతర పీఠిక సంతరించి సాహిత్య అకాడమీ వారిచే నభినందనములందిరి. వీరి ప్రకాశిత సాహిత్య పరిధినిగాంచి, శ్రీ పరబ్రహ్మ తీర్థులు స్నేహితులైరి. వారు యడవర్తి ఆంజనేయశాస్త్రి స్మారక సంస్కృత పాఠశాలకు కార్యదర్శిగా నాహూయమానుల నొనర్చిరి. ఆ పాఠశాల నెంతో ప్రకాశింపచేసిన సంస్థావ్యవస్థాపకులుగా, సంస్కర్తలుగా నాచార్యులు పేరుగాంచినారు.

## బిరుదములు

ఆ సంవత్సరముననే ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీరికి వీరు రచించిన దర్శనాలను పురస్కరించి "డాక్టరేట్" మరియు "కళా ప్రపూర్ణ" బిరుదముతో సత్కరించినారు. తదుపరి బెంగుళూరువారు "విద్యాభూషణ" బిరుదము బహూకరించినారు. ఇదివరకే "విద్యాధురీణ" బిరుదమందినది పైనచదివియున్నాము.

## పత్రికా సంపాదకత్వము

ఇట్టి వీరు "పంచానన - అరుణోదయ - వీరబ్రహ్మ బోధిని" మున్నగు పత్రికలకు వ్యాసములు వ్రాయుటయేగాక గౌరవ సంపాద కులుగాను, సంపాదకవర్గ సభ్యులుగాను పెక్కేండ్లు వ్యవహరించి ఆయా పత్రికలను బహుళ ప్రచారమునొందుట కెంతయో దోహద మొనంగినారు.

## ఆంధ్ర శిల్ప కళాపరిషత్తు

కళాప్రపూర్ణ బిరుదాంచిత శ్రీ వీరరాఘవాచార్యులు గుంటూరు జిల్లా బోర్డు పండితులుగా నియుక్తులైనప్పటినుండి వారి మనోవాంఛ యగు "శిల్ప కళాపరిషత్తు" నొకటి స్థాపించవలె ననునది ఉనుమ డింప దొడంగినది తమ ఉద్దేశమును అప్పటి "అరుణోదయ" పత్రికలో నొక వ్యాసరూపమున ప్రకటించిరి. సంఘోద్ధరణకు దీక్షబూనిన శ్రీ జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులుగారు (పత్రికాధినేతలు) ఆ వ్యాసమును అత్యంతాదరాభిమానములతో సంపాదకీయము వ్రాసి ప్రచురించిరి. మన ఆచార్యుల వ్యాస ప్రభావమెట్టిదోకాని ఆ సంవత్స రమునందే శ్రీ శ్రీ శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారి పీఠాధీశ్వరులగు శ్రీ శ్రీ శ్రీనివాస స్వామివారి ఆధిపత్యమున కందిమల్లయ్య పల్లెలో మహాశివరాత్రి పర్వణి కాలమున నొక శిల్ప పరిషత్తు "ఆంధ్ర శిల్ప కళా పరిషత్తు" పేరుతో ప్రాదుర్భవించినది. తమ వాంఛ రూపుదిద్దుకొన్నందుకు కొండూరు వారెంతయో హర్షించినారు. ఈ పరిషత్తు నెలకొనుటకై సర్వశ్రీ జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులు, పులి పర్తి శరభాచార్యులు, వోలేటి చిరంజీవి శర్మయును, చిట్టాపూడి నాగభూషణాచార్యులు, ఎట్టోజు మాధవాచార్యులవంటి ప్రముఖులెంత

ఎంతయో కృషి చేసినారు. ఈ శిల్ప కళా పరిషత్తు ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమియొక్క గుర్తింపునంది 7-8 శిల్పకళా ప్రదర్శనలు జరిపి రాష్ట్రమంతట శిల్పకళా చైతన్యమును కల్గించినది.

ఆచార్యులవారి మేనమామ కుమారులు బ్ర॥ శ్రీ॥ పులిపర్తి శరభాచార్యుల కుమార్తె వివాహ సందర్భమున నీ కళాప్రపూర్ణులు పిడుగురాళ్ళ గ్రామమునకు వెళ్లిరి. అపుడు అచట సమావేశులైన ఆగమ - శిల్పశాస్త్ర పండితులెల్ల రీ వీరరాఘవాచార్యులను ఆంధ్ర కళా పరిషత్తునకు కార్యనిర్వాహక ప్రముఖ స్థానమున కెన్నుకొనిరి. అట్టి బాధ్యతాయుత పదవిని స్వీకరించి పరిషత్తు నెంతో అభివృద్ధి మార్గమున పురోగమింప జేసినారు. శిల్పశాస్త్ర విషయక రచనలు, వ్యాసములు తాము స్వయము వ్రాసి, నిపుణులగు శిల్పాచార్యులచే, కవులచే కూడ వ్రాయించి, ఆయా శిల్పి బ్రహ్మలకు బహుమానములు బహూకరింపజేసిరి. శిల్పశాస్త్ర చర్చలు జరిపించి శాస్త్రీయ శిల్పజ్ఞాన ప్రచారము చేయించినారు. ఆకాలమున, ప్రఖ్యాత శిల్పవిద్యా విశేషజ్ఞులును, ఆగమ శాస్త్ర ఖనియును "భారతీయ మహాశిల్పము" అను గ్రంథమును రచించిన బ్ర॥శ్రీ॥ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిశ్రేష్ఠు లా పరిషత్తున కధ్యక్షులుగా నుండిరి.

వీరరాఘవాచార్యులయొక్క శిల్ప పరిషచ్ఛేవాభిమాన ప్రభలు నల్లెడల ప్రసరించుచుండ నాంధ్రప్రదేశ్ రాష్ట్ర దేవాలయోద్ధరణోద్యమ సంస్థ యొకటి Temple renovation committee నెలకొనబడినది. అందులో శ్రీ రాళ్లబండి సుబ్బారావు మారేమండ రామారావు మున్నగువారు సభ్యులుగా నుండిరి. వారితోపాటు, శిల్పకళాభిజ్ఞులు లేనిది ఆలయోద్ధరణకీ సంస్థ పూనుట సమంజసము కాదని ప్రభుత్వము వీరిని కూడ నొక సభ్యునిగా నియమించి గౌర

వించినది. అప్పట్లు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారమాత్యులుగా దేవాదాయ శాఖను స్వీకరించియుండిరి. మంత్రిగారితో సంప్రతించి తిరుపతిలో నొక శిల్ప కళాశాలను నెలకొల్ప చేసిరి. మంత్రివర్యులు రాష్ట్రములోని జీర్ణ దేవాలయోద్ధరణకు కూడ పూనుకొనిరి. దక్షిణ భారత సుప్రసిద్ధ మహాశిల్పియు, స్థపతియునైన శ్రీ గణపతి స్థపతి గారితో జీర్ణాలయోద్ధరణ ప్రణాళిక గురించి ఆలోచించుట సముచితముగా భావించి ఈ దేవాలయోద్ధరణ సంస్థ వారిని ఆహ్వానించినది

స్థపతిగారి శాస్త్రీయ శిల్ప నిపుణతా విశేషములు సంగ్రహించుట కొఱకు మన వీరరాఘవాచార్యులను స్థపతిగారిని సమావేశ పరచుట కేర్పాటు చేయబడినది. శిల్పాచార్యోభయులు పరస్పరము వివిధ శిల్ప సాంప్రదాయములనెల్ల చర్చించి, చర్చాసారములనెల్ల సమ్మేళపరచి, ఒక నవ్య శిల్పవిధానమును అధునాతనముగా నారంభించుచో బాగుండునేమో యని వీరరాఘవాచార్యు లభిప్రాయపడిరి. స్థపతిగారీఆచార్యుల శిల్పశాస్త్ర విజ్ఞానమున కచ్చెరువొంది సాదరముగా "ప్రస్తుతము అట్లు సాధింప నను వు కాదేమో" అని సోపపత్తికముగా తమ అభిమతము వెల్లడించిరి. ఆచార్యులుగారును స్థపతిగారి సూచనలకు వల్లెయని వారితో నేకీభవించిరి. స్థపతిగారి శాస్త్ర విశిష్టతనుగూర్చి మన ఆచార్యులవారు అమాత్యులవారికి తమ సదభిప్రాయము తెలిపినారు. ఆ తరువాత దేవాదాయ మంత్రిగారు వీరరాఘవాచార్యులు కలలు కన్న "శిల్ప కళాశాల"ను స్థాపించి శ్రీ గణపతి స్థపతిగారిని, అద్దానికి, గౌరవాధ్యక్షులుగా నియుక్త పరచిరి. ఏ తత్కళాశాలకు, సంస్కృతాంధ్రాంగ్లాది హిందీ మహారాష్ట్ర విద్వాంసులు శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారిని, శ్రీ వీరరాఘవాచార్యుల అభిమతాశీర్వచన ప్రోత్సాహమున, ప్రభుత్వము ఉపాధ్యక్షులుగా నియుక్త పరచినది. పెదపాటిగారి అనన్య శ్రద్ధ

వలన స్థపతిగారీ కళాశాలను అభివృద్ధి మార్గమున నడువ సాగినారు.

## శ్రీ వీరరాఘవాచార్యుల రచనా విశేషములు

ఇక వీరి రచనా విశేషములంగూర్చి కొంత తెలిసికొందము. వీరు దాదాపు ముప్పదికి మించి గ్రంథములు రచించినారు. వానిలో (6) నవలలు, (5) జీవిత చరిత్రలు, (5) కవితలు, (4) దర్శనాలు మరియు ననేక సాహిత్య వ్యాసములు ప్రకటించినారు. ముద్రితములై చూడగలిగినవి మాత్రమే ఈ రచయిత ఇందులో నుటుకింప గలగినాడు. అముద్రితా లింకను యుండునని తోచును. సాహిత్యాభిమానులు, సాంఘీయులు, సామాజికులు ఆయాముద్రితాలను వెలకి తెచ్చినచో నాచార్యుల ప్రతిభావిశేషములింకను ప్రచురమొందునని నా తలంపు.

ఇక వీరి రచనా విశేషములలో క్లుప్తముగా నొకొక దాని గూర్చి తెలిసి కొందాము.

ఆచార్యులవారు తమ "యోగదర్శనము" నందాశయమను శీర్షికలో తెల్పిన దానిని బట్టి వీరు తమ ఏడెనిమిదేండ్ల చిఱుప్రాయముననే గురుపాదులగు తమ తండ్రిగారి నుండి యమని యమాసన ప్రాణాయామాదులభ్యసించిన వారని తెలియ చున్నది. వీరిలో నధ్యాత్మికతత్త్వ బీజ మంకురించి పెరుగుచు గ్రంథ రచనా కృషి ఆరంభించు నాటికి పుష్ప, ఫల, పల్లవములతో నలదారినదనవచ్చును. అట్లు కానిచోనూనూగు మీసాల నూత్నయౌవనారంభ ప్రాయమైన 18-19 సం॥ ఈడుననే అనగా క్రీ.శ. 1944న "ఆత్మదర్శన" మనబడు తాత్త్విక గ్రంథము రచించి ప్రచురింప గల్గెడి వారేనా!

క్రీ.శ. 1939-44 కాలములో "ఆత్మ దర్శన-శిల్పదర్శన-సాహిత్యదర్శన రచనలలో నిమగ్నులైనారు. ఈ గ్రంథ రచనయే "దర్శనాచార్య" బిరుదమును సంపాదించి పెట్టినది. ఇవి అపూర్వము-అనన్యము. దర్శనాలు వ్రాయటంలోని ఆచార్యులవారి ఉద్దేశ్యం ఇట్లు భావింపనగును

"ఆత్మానా ఇదమేక ఏవాగ్ర ఆసీత్-నాన్యత్ కించన మిషత్" అను ఉపనిషద్వాక్య ప్రభావమని తోచును.

## ఆ త్మ ద ర్శ న ము

సంపూర్ణముగా బ్రహ్మచర్యాశ్రమము పూర్తికాక పూర్వమే ఆచార్యుల వారు ఆత్మదర్శనమొనరించిన వారగుటచే తమ ఆత్మ దర్శన గ్రంథమున "ఆత్మ"యన నేమియో యను ప్రశ్నకు సమాధానముగా స్వానుభవ విజ్ఞానము వెలువరించి లోకమునకు మార్గ దర్శకముగా వివరించి, శాస్త్రసమ్మతముగా విలిఖించి ప్రకటించినారు. ఆత్మను గూర్చి స్వానుభవ పూరిత విషయజ్ఞానము తెలుపు వారే బ్రహ్మ వేత్తలుగాను, యోగులుగాను పేర్కొనబడినారుకాని, కేవల గ్రంథస్థ విషయ ప్రచారము చేయువారు యోగులు కాజాలరని విజ్ఞులెరుగుదురు.

ఆత్మ దర్శనమున నాచార్యులు "ఆత్మ"యననేమి? అంతఃకరణమగు మనస్సునకును, ఆత్మకును సంబంధము కలదా? శరీరాంతర్వర్తిత ఆత్మకును శరీరమునకును సంబంధమెట్టిది? జీవుడు - ఆత్ముడు అను నిరువురొకటేనా? లేక భిన్నులా? అను వివిధ విషయ వివరణము కడు సులభ శైలిలో సామాన్య మానవుని హృదయము నాకట్టురీతిని బోధపరచినారు. ఈ గ్రంథము "నేను" అను శీర్షికతో అనగా "అహం" అను శీర్షికతో నారంభించి "మోక్షము" అను శీర్షికతో పూర్తి చేసినారు. లోకమున 'నేను' పదము అహంకారార్థమున గ్రహింపబడుచుండుట అందఱెఱిగినదే. ఆ అహంకార రాహిత్యమే

ముక్తి లేదా మోక్షము అని పెద్దలు వచించుచు వచ్చుచున్నారు. మోక్షమే ప్రాణికోటికి భవతారకమని శ్రుతి, స్మృతులు ఘోషించు చున్నవి.

ఆచార్యులవారే 'నేను' పదమును ఆధ్యాత్మికముగా నిట్లు వచించినారు మహావాక్య చతుష్టయములో "అహం బ్రహ్మాస్మి" ఒకటి. ఇందు అహం = నేను, అనగా జీవుడని అంతరార్థము. ఈ జీవుడాత్మాంశజుడయ్యును (బ్రహ్మాంశజుడై కూడ) మాయామోహ బద్ధుడై యున్నాడు. మాయ యొక్క మోహబంధము నుండి, నేను అను జీవుడు, విడివడిననేకాని తనకు మూలకారణమైన బ్రహ్మముతో-ఆత్మతో-నైక్యత నొందగలుగడు. ఈ నేను అను జీవుని బంధ మోక్షణమే బ్రహ్మమగుట అని భావము. ఇట్లేబంధవిముక్తికై జీవుడు సర్వదా నేను బ్రహ్మమునే కాని, జీవుడను కానని - అనగా అహం బ్రహ్మాస్మియని తపస్సు చేయవలసి యున్నదని ఈ మహావాక్యము జీవుని గురించి, ఆత్మగురించి బోధించుచున్నది. ఇట్టి జ్ఞానమును గనుటయే (కలుగుటయే) ఆత్మదర్శనమనబడును. కావుననే ఈ దర్శనమును అహం=నేనుతో నారంభించి జీవన్ముక్తియనబడు మోక్షముతో నంతమొందించుట యెంతయో సముచితమని చెప్పవచ్చును.

వీరరాఘవాచార్యులు లౌకికవాఙ్మయ - సారస్వతమునందెంత ఘటికులో తాత్త్విక సారస్వతమునందంతయే ఘటికులనుటకు వీరి దర్శ[illegible], దిగ్దర్శన రచనములెల్ల నిరూపించుచున్నవనుటలోనసత్యము లేదు.

## శిల్ప దర్శనము

ఉదాహృత గ్రంథానంతరము వీరు విరచించి ప్రకటించినది "శిల్ప దర్శనము". ఆత్మ దర్శనము జగదీశ్వర (పరమ) తత్త్వ

ప్రకాశన మగుచో, నీ శిల్పదర్శనము జగద్రూపతత్త్వ ప్రకాశక విజ్ఞానము జగద్రూపమనగా సృష్ట్యుత్పన్న క్రమవికాసతత్త్వము. జగదుత్పత్తి పంచమహాభూతముల వలనయైనదని భౌతిక సాంఖ్యాది శాస్త్రములు తెల్పును. ఐనను పృథివ్యప్తేజో వాయురాకాశములగు నా పంచభూతములు వ్యష్టిరూపమున సృష్టికి కారణములైనవా? లేక వాటి సమిష్టి శక్తియే కారణమా? అథవా వాటి కలయికచేనుత్పన్న మైన యెడల నే యే భూతశక్తి యెంతెంత సమీకృతమైనది? వంటి విషయ విజ్ఞానము గురించి వివరించుచు వాటి కలయికచే సంభవ మైన పరిణామరూపమే యీ విశ్వము లేదా జగత్తు లేదా ప్రపంచ ముగా పేరొందినది. ఈ భూత భాగ సంయోగమునే పంచీకరణ మందురు. ఈ పంచీకరణమే విశ్వసృష్టి విజ్ఞానమునకు బీజ భూత మని చెప్పవచ్చును. దీనినే విరాడ్విశ్వ శిల్పిచాతుర్యమనవలయును. ఇట్టి జగచ్ఛిల్పి విజ్ఞానమును లేదా జగచ్ఛిల్పమును దర్శించుటయే ''శిల్పదర్శనము." దానినే సనాతనులైన ఆదిమ శిల్పులు జగ త్తంతయు నొక శిల్పమని అదియే ''సర్వం శిల్ప మయం జగత్" అని ప్రకటించినారు.

"యుజిర్ - యోగే" అను ధాతువు నుండి యోగ శబ్ద ముత్పన్నమైనట్టు "శీల సమాధౌ" అను ధాతువు నుండి శిల్ప' శబ్ద ముత్పన్నమైనది. సమాధి యను నర్థ మొసంగు-శీల-పదము నియమ బద్ధమైన తపస్సని యర్థ మొసంగును. తపస్సనగా ఆలోచనా యుక్త సంకల్ప భావ ధ్యాన మగ్నతతో జరుగు కార్యము. ధ్యానము యొక్క ఏకాగ్రత లేనిది యే పని యైనను పరిపూర్తి కాదని అందరెరిగినదే. ఆలోచనా యుక్త నిశ్చల యేకాగ్రతతో నెరవేరిన పని కర్త యొక్క తపః ఫలమనబడును. ఇట్టి తపస్సే శిల్పము. శిల్పి తన మనోభావ సంకల్పాదులు ఏకాగ్రతతోనే పూర్తి చేసి కృత

కృత్యమగును కదా! అట్టి ఏకాగ్రతను తపస్సన్నను, ధ్యాన మన్నను, శిల్పమన్నను భిన్నార్థద్యోతకములు కావని తెలియనగునని శిల్ప దర్శనమున శ్రీ వీర రాఘవాచార్యులు గారు ప్రతిపాదించినారు

శిల్ప విజ్ఞానమును, దాని ప్రాముఖ్య ప్రాధాన్యతలను వివరించుచు ఆచార్యులవారు, సృష్టి (విశ్వము) యెట్లుద్భవించినది? సృష్టి యందలి స్థూల సూక్ష్మ, చరాచర వస్తు రూప పదార్థము లెట్లు కల్గిన వను విషయములు మున్నగు వానిని చక్కగా చర్చించినారు. అనాది కాలము నుండి వేదాద్యుపనిషత్తుల ద్వార మహాఋషులచే చర్చింపబడి, తుదకీ సృష్టి కొకమూల కారణకర్తయుండి తీరవలయునని ఊహించి నిర్ణయమునకు వచ్చినారు. అట్టి కర్తయే "పురుష"డని, "బ్రహ్మ"మని. "స్రష్ట"యని, "విశ్వకర్మ"యని, "ఏతం సత్ విప్రా బహుధా వదంతి" యను నట్లు పెక్కునామములతో ఋగాది వేదములందు వర్ణింపబడినాడు. పురుషసూక్త - విశ్వకర్మ సూక్తములు సైతము జగచ్ఛిల్పిని గూర్చి వర్ణించిన అంతర్భావమిదియేయని ఆచార్యులు నిరూపించినారు. సృష్టి యొక్క ఉత్పత్తి ఒక క్రమము ననుసరించి జరిగినది. పంచభూతములు, పంచశక్తులు పంచవాయువులు (ప్రాణములు) మొదలగునవి స్పర్శరూప రసగంధాదులు, జ్యోతిశ్శీతోష్ణములు ప్రకృతివలన నొకటి తరువాయి నొకటి కలిగి ఈ జగత్తేర్పడి నడుచుచున్నది. సర్వదా యిది సాగుచు వచ్చుచున్నందుననే సృష్టికి "జగత్త" ని నామము కల్గినది. జగత్తనగా పుట్టినది సాగుచుండుననియు కూడ అర్థము ఇది అంతయు పరమేశ్వరుని శిల్పచాతుర్యముగాక మరేమిటి? విశ్వశిల్పి యొక్క "శిల్ప" తత్త్వమును సంగ్రహముగ చర్చించి సృష్టికర్తయైన విశ్వకర్మ ఇట్టివాడని లోకము తెలియ గల్గుటకై రచించిన శిల్ప సారస్వతమును ఆచార్యులవారు శిల్ప దర్శనమన్నారు. పారంపర్యముగా, సంప్ర

దాయ సిద్ధముగా వచ్చు యే శిల్పికైని యేదేని రూపమును సృజింప సంకల్పించి దానికనువగు పరికరణ వస్తు సంభారములు సేకరించి, ఏకాగ్రతతో తన శిల్పచాతుర్యము వెలువరించును. విశ్వ శిల్పి కూడ జగత్సృజనా సంకల్పముచే గాయత్రీ నామక నిజ శక్తి ద్వారా భూత పంచకమును కల్పింపచేసి ఈ సృష్టి నిర్మాణ మొనర్చియున్నాడనుట కనేక ఉపనిషత్సాక్ష్యములను, వేద మంత్రములను సాక్ష్యములుగా మన ఆచార్యవర్యు లెత్తి చూపినారు.

సృష్ట్యారంభ శిల్పముతో నీ దర్శన మారంభించి, నేటి భావ రూప శిల్పము-ఆలయ ప్రతిమా స్థాపత్యము వరకు దర్శనకర్తగారు ఆగమోపనిషచ్ఛ్రుతి ప్రమాణములనుటంకించి లోకమును తేజపరచినారు. విశ్వకర్మ పంచాననోద్భవులైన సానగాది పంచబ్రహ్మ ఋషులేగాక ఋభ్వాది సౌధన్వాశ్వినులు దేవశిల్పులుగా ప్రసిద్ధులని తెల్పినారు. భృగు, వశిష్ట, మయ, నారదాది గర్గ, పురందర, శుక్ర బృహస్పతులను, అగస్త్య, కశ్యప, గౌతము లెల్లరు మహాశిల్పులుగా ప్రస్తుతింపబడిన పురాణ ప్రమాణములు సైతము ఆచార్యులు చూపినారు. దీనినిబట్టి శిల్పమెంత మహోత్కృష్ట కర్మ విజ్ఞానమో పాఠకు లెరుంగకుందురా!

ఇక మానవశిల్పమును గూర్చి శ్రీ కొండూరు స్వయం శిల్ప శాస్త్ర విజ్ఞులగుటచే సాంప్రదాయిక విగ్రహ నిర్మాణ సౌందర్యాదులను, వాటికొలమాన ప్రమాణములను, వివిధ దేవతామూర్తుల సృజనా పద్ధతులను, లింగాంక వివరణములు, వాటి తత్త్వస్వరూపముల నత్యంత సుగ్రాహ్యముగా విశదపరచి, భావిశిల్పులకు మార్గదర్శకముగా నీ గ్రంథమును విరచించి శిల్పము వలనగల్గు దేవత్వ ఫలముల నుటంకించి తేటతెల్ల మొనర్చినారు. విశేష వివరములకు "శిల్ప దర్శనము" చూడగలరు.

ఒక్కను ప్రాణములేఐని చెప్పజాలమని భావము తదుపరి నొక పద్యమున —

"ఏపని నెరిగినంత నేను నీవును పరు
లెల్ల జీవకోటి షేక మగునొ !
ఒట్టివాడె దేవుడగు తత్త్వదృష్టిని"

అని ఆధ్యాత్మిక లక్షణమును విశదపరచినారు.

ఇట్లు ఆధ్యాత్మిక పరమైనవి, లౌకిక పరమైనవి యనేక నీతిసూక్తులు మృదుమధుర సులభ భాషలో నలనాటి వేమన వలె తన హృదయమునువిప్పి విజ్ఞాన సారపూరితమగు చిన్నచిన్న గుళికలను మానవుని అజ్ఞాన రుగ్మతను నశింపజేయుటకై రాఘవాచార్యులు లోకమున కందించినారు. ఇది మిత్ర సాహస్రి యొక్క ప్రధాన సారాంశము.

## వీ ర రా ఘ వ వ్యా సా వ ళి

ఇంతకుముందు, మన వీరరాఘవాచార్యులు, స్థిరోద్యోగము చేపట్టకపూర్వము వ్యాసములు వ్రాయుచు తమ మనోభావములను తమ అభిప్రాయములను పత్రికలద్వార ప్రకటించుచుండెడివారని తెలుపబడినది. అట్టి వ్యాసములను సమీకరించి "వీరరాఘవ వ్యాసావళి"గా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ధన సహాయమున నొక గ్రంథము ప్రచురింపబడినది ఈ వ్యాసములు రెండు భాగములుగా నున్నవని, నాకు లభించిన రెండవ భాగమువలన తెలియుచున్నది. ఈ రెండవ భాగమును గూర్చి ఇంచుక తెలియుదము.

ప్రకృతమగు ని రెండ భాగపు వ్యాసములు గ్రంథరూప మున వెలువడుటకు పూర్వము "ఆంధ్రప్రభ"లో ప్రకటింపబడి నవియే అత్యధికము కలవు. ఆకాశవాణి ప్రసారితములుకూడ కొన్ని కలవు. ఇందలి వ్యాసములన్నియు, శిల్పకళా విషయక రచనములే విశేషించి మన ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధ దైవ క్షేత్రముల వైశిష్ట్యము. మరియు శిల్ప వైభవము దేవతామూర్తుల ప్రస్తావ ప్రస్తుతలిందు వర్ణింపబడినవి

వీరు తమ ఉద్యోగాన్వేషణ కాలములో ననగా స్థిరోద్యోగము చేపట్టువరకు గల కాలమును వ్యర్థపుచ్చక, తాము పర్యటించిన వివిధ క్షేత్రాలు, దేవాలయాలు విశేష విషయ గాథలు విరచించి నారు. క్షేత్రాలయాదులనెల్ల శిల్ప దృష్టితోను, శిల్పి దృష్టిలోను తిలకించి అందులో ప్రత్యేకముగ తిరుపతి, కాళహస్తి, అహోబ(బి)ల, మహానంది మొదలుగాగల వానిని వర్ణించు వ్యాసములు ప్రచురిత ములైనవి.

**తిరుమల తిరుపతి :** భారతదేశముననేకాదు ప్రపంచ ప్రఖ్యాత మైనదీ శ్రీ తిరుమల వేంకటేశ్వరస్వామి దేవాలయము. అనుప మానమయిన ఈ వేంకటేశ్వరస్వామిని యుగయుగములనుండి కొలు వని వారు భారతఖండములో లేరనవలయును. అనాదినుండి ఈ వేంకటేశ్వరుడు నాటితమిళ (నేటి ఆంధ్ర)భూభాగమున వెలసియున్న కారణమున గాబోలు దాక్షిణాత్యులైన తమిళుల కెక్కువ ఆరాధ్య దైవమయినాడు. తమిళ భక్తాగ్రగణ్యులలో పేరొందిన "నాథ" ముని వంశమునందలి "తిరుమల నంబి" యీ తిరుమలేశ్వరుని పరమ భక్తుడు. ఆయన మన తిరుపతి నాథుని సేవలోనే తమ జీవిత గడిపినారని, యీ తిరునంబిగారి మేనల్లుడే విశిష్టాద్వైత

ధర్మసంస్థాపకులు శ్రీమద్రామానుజాచార్యులవారని ఆచార్యులవారు లోకమున తెరుకపరచినారు

ఇట్లు పరిశోధనాత్మక నిశిత పరిశీలనమేగాక శ్రీకొండూరు వారు తమ దృగ్భావ వైశిష్ట్యమువలన ప్రకృతియందలి ప్రతి రూపమునందును, ప్రతి వస్తువునందును ఆధ్యాత్మిక తత్త్వసారమును సంగ్రహించి లోకమునకు పంచిపెట్టుదురు. సప్త గిరీశ్వరుని దర్శింప పోవువారు కొండ క్రిందినుండి పైకిబోవు మార్గములోని ఆరు కొండలు దాటి ఏడవ కొండపైగల దేవుని దర్శించుటమును, ఆధ్యాత్మికపర ముగా నారు కొండలనునవి ఆధార, స్వాధిష్ఠ మణిపూరక, అనాహత విశుద్ధ, ఆజ్ఞాచక్రములు గాను, దేవుని నిలయమైన ఏడవ కొండను సహస్రారముగాను సమన్వయించి, యౌగిక రహస్యములను వెలువ రించినారు ఇదియే సృష్టిలోని ఊర్ధ్వ లోకతత్త్వమని తెలిపినారు. అందువలననే యీ కొండకు సప్తగిరి యను ఖ్యాతి కల్గినది. సృష్టి కర్తయైన పరబ్రహ్మము వేంకటేశ్వరుడుగా నవ్యక్త రూపమున నున్నాడని తెల్పుటయే శిల్పముయొక్క పరమార్థమని కూడ ఆచా ర్యులు నిరూపించినారు.

అవ్యక్త మనగా శివకేశవాభేదముగా గ్రహించుట అర్థవంత ముగా నుండునని వ్యాసకర్తగారి అభిమతము. వేంకటేశ్వరు డాదిలో 'శివ' స్వరూపుడుగా నుండెనని భావించువారి తలంపు ననుసరించి, స్వామియొక్క కిరీటాంతర్గత కేశజాలము జటలుగాను, కంకణ కేయూరాదులు నాగాభరణములుగా నెంచినచో శివస్వరూపుడనియు, శంఖ చక్రాంకాదులు, ఊర్ధ్వ పుండ్రములు వైష్ణవ చిహ్నములగు టచే విష్ణువనియు భావించుట అనుచితము కాదు. ఇట్టి స్వామియొక్క ఆకృతిని అద్వైత భావతత్త్వ వేదియగు మహాశిల్పి ఈ వేంక

చేశ్వరమూర్తిని నిర్మించి శివకేశవాభిన్నతను ప్రకటించినట్లు తలంచిన దర్శనాచార్యులవారి భావ మత్యంత సముచితమని తలంచ వలయును.

ఒకప్పుడు శ్రీమద్రామానుజాచార్యులవారి సప్తగిరిపై, కలియుగ విశ్వకర్మగా ఖ్యాతి గడించిన మహాశిల్పి జక్కణాచార్యుల సహాయ సహకారములతో తిరుపతి ఆలయ పునర్నిర్మాణ కార్యము నిర్వహించినట్లు పరిశోధకుల అభిప్రాయము.

ఇట్టి సప్తగిరిపై పరబ్రహ్మము, (బ్రహ్మ) అవ్యక్తముగాను, శివుడు వ్యక్తముగాను, విష్ణువు సువ్యక్తముగాను త్రిమూర్త్యాత్మక రూపమున నున్నాడనుట యుచితమని దర్శనాచార్యులు వ్యక్త పరచినారు.

సప్త శిఖరాకారమైన తిరుపతి కొండచుట్టుగల ప్రసిద్ధ దేవాయతనముల నిర్మాణములలో పేర్కొనదగినది కళ్యాణమంటప మొకటి. ఇది ఆంధ్ర కర్ణాటకముల నేలిన ఆంధ్ర భోజుడునాబడు శ్రీకృష్ణ దేవరాయలచే నిర్మింపబడినది. ఈ నిర్మాణమందలి శిల్పమంతయు వైష్ణవ గాథామయమైయున్నది.

దర్శనీయమగు మరొక ఆలయము శ్రీమదాది వరాహస్వామి వారిది. వీరి వైభవోన్నతులు స్థల పురాణములందు వర్ణింపబడినవి. ఈ స్వామి శ్వేతవరాహమూర్తి ఇట్టిదే శ్రీగోవిందరాజుస్వామ్యాలయము. గోవిందరాజ స్వామివారు శ్రీరామానుజాచార్యులచే ప్రతిష్ఠితులైనారని జనశ్రుతి ఈస్వామియొక్క ఆకారము చాల పెద్దదై శేషతల్పమున యోగ ముద్రయందున్నట్లు శిల్పింపబడిన దివ్యమూర్తి. ఈ ఆలయము దిగువ తిరుపతిన కలదు. తొలుత ఈస్వామివారిని

దర్శించియే భక్తులెల్లరు ఎగువ తిరుపతియైన సప్తగిరికి పోయెదరు. కొండపైగల స్వామివారు బ్రహ్మ స్వరూపులగుటంజేసి కాబోలు శ్రీవారిదేవేరు లిచట నిలయ మేర్పలేదు ఆ కారణముననే కానగును శ్రీదేవియు, భూదేవియు శేషశాయియైన గోవిందరాజు స్వామి కిరుప్రక్కల దిగువ తిరుపతిలో దర్శనమిత్తురు ఇంకను విశేషముల గురించి దర్శనాచార్యుల గ్రంథమును చూడుడు

## శ్రీకాళహస్తి క్షేత్రము

తిరుపతివలెనే భారతావనిలో ప్రఖ్యాతిగడించినది "శ్రీకాళహస్తి క్షేత్రము. ఇది శిల్పమునకు కాణాచి యనదగినది తిరుమల దేవుడు శ్రీవేంకటేశ్వరుడుకాగా ఇచటి దేవుడు మహేశ్వరుడు - శివుడు. ఈ శివ క్షేత్రమునకు "శ్రీకాళహస్తి" యనిపేరు పురాణ ప్రసిద్ధము. శ్రీ సాలెపురుగు, కాళ = సర్పము, హస్తి = ఏనుగని అర్థము. ఈ శ్రీ=కాళ హస్తి యను మూడు తిర్యక్ ప్రాణులకు మోక్షమొసంగిన మహాదేవుని ధామమగుట నీక్షేత్రమున కీపేరు ప్రఖ్యాతమైనది ఈ క్షేత్ర మాహాత్మ్యములు ధూర్జటి మహాకవి విరచిత శ్రీకాళహస్తి మాహాత్మ్యము, మరియు కాళహస్తి శతకమున వర్ణితములై యున్నవి.

ఈ క్షేత్రమున వెలసియున్న శివలింగము భరత ఖండములోని పంచభూతమయ పంచలింగములలో నిది యొకటి. చిదంబరమునంద కాశలింగము, అరుణాచలమున జ్యోతిర్లింగము, జంబుకేశ్వరమున జలలింగము, కంచిలో పృథివీలింగము, మరియు నీక్షేత్రమున వాయులింగము. ఇట్టి పంచలింగములు పంచభూత నామకములుగా ప్రసిద్ధి. ఈ క్షేత్రములోని లింగము వాయులింగ మనుటకు సాక్ష్యముగా గర్భాలయమందలి జ్యోతి (దీపము) నిరంతరము చలించుచు వెలుగుచుండును, ఈ లింగ నిర్మాణమునందు

వాయు ఘూంకారము ప్రధానముగా నుండుటచే నందలి వాయుప్రసరణమువలన జ్యోతి కదులుచు వెలుగుచుండును. ఈ చమత్కారము శిల్ప విజ్ఞాన రహస్యవేత్తయైన శిల్పాచార్యుని ప్రతిభా ప్రజ్ఞలని విజ్ఞులు భావింతురు. ఇది నేడి విద్యుచ్ఛాస్త్ర విజ్ఞానముకన్న మిన్నయునస నసస్యముకాదు.

ఇట్టి శిల్ప రహస్య భరితమైన నీక్షేత్రాయతనమునందలి గర్భాలయము పల్లవ వంశ్య రాజులలోని తొండమాన్ మహారాజు నిర్మింపచేసినాడని ఆచార్యుల పరిశోధన తెలుపును. ఈ ఆలయము రామేశ్వర - చిదంబరములవంటి వాస్తు విధానమున కట్టుబడియున్నందున నచటి భూతమయ లింగముల విశిష్టత నిచట కూడ శిల్పులు తమ ప్రతిభా విశేషముతోనీ వాయులింగమును నిర్మించియుందురని విశ్వసించుటలో సందేహములేదు. విశ్వకర్మయే కదా అపూర్వతర, ఆశ్చర్యకరాద్భుత వస్తువులు నిర్మించువాడు. ఆయన సంతతిలో సాంప్రదాయికముగా వచ్చుచున్న శిల్పాచార్యులలో నట్టి శక్తియుండుననుట వింతకాదు. ఇచటి స్తంభములమీది చెక్కడములు, ముఖమంటపాదులు మున్నగునవి శిల్పకళా సంపన్నములై లోకుల హృదయములు నాకర్షించుచున్నవియే. ఇచటి చెక్కడములలో శ్రీచక్రాదులు, సహస్రారాది చక్రములు శిల్పాచార్యుల యోగ విద్యాపారీణతను ప్రకటించుచున్నవి. ఇట్లెన్నెన్నో తత్త్వ రహస్యములను, శైవ పారమ్యతను శిల్పించి, తత్త్వపిపాసుల కాశిల్పి బ్రహ్మలు మార్గదర్శకులైనారనుట సత్యదూరము కాదు. ఇంతటి, ఇట్టి తత్త్వమును శిల్పములందు దర్శించిన మనకొండూరు వారెంత తాత్త్విక శిల్పజ్ఞులో పాఠకులు గ్రహింపగలరు.

స్థల మనకొండేశ్వరుడు, జ్ఞాన ప్రసూనాంబికాలయము, సారస్వత తీర్థపు నానావిధ మూర్తులు, షణ్ముఖస్వామి నిలయమైన

చెంగల్ రాయాలయమును మున్నగువాని శిల్ప వైభవము విస్మరింపక దర్శింపదగినవి. కాళహస్తీశ్వరుని భక్తాగ్రేసరుడైన కన్నప్ప విగ్రహము చూడసొంపుగా ధనుర్బాణ యుక్తముగా నిర్మింపబడిన దానిని మనఆచార్యులు ప్రత్యక్షముగాగాంచి, శిల్పికిని, శిల్పమునకును కేల్మోగిడ్చి తన్మయులై యుందురు. కానిచో నాచార్యులు తమ గ్రంథమున నిచటి కొన్ని చిత్రపటములు ముద్రించి యుండెడి వారేనా ?

## తాడిపత్రి దేవాలయము

ఈ ఆలయము ఆంధ్రప్రదేశమున అనంతపురము జిల్లాలో తాడిపర్తి(పత్రి)యను గ్రామమున కలదు. ఇచటి దేవాలయములు, విశేషించి విష్ణ్వాలయమైన "చింతల వేంకట రమణా"లయము మరియు శివాలయమగు "బుగ్గరామేశ్వరాలయము" విశిష్ట శిల్ప భూయిష్టములని చెప్పబడును. భక్తజనుల చింతనలను హరించు వాడగుటంజేసి శ్రీ వేంకటరమణస్వామికి "చింతల" నామాంకితుడుగా ప్రసిద్ధికల్గినది. ఈ దేవాలయము "అముక్తమాల్యదయగు" విష్ణుచిత్తీయ కావ్యకర్త శ్రీకృష్ణదేవరాలయచే పునర్నిర్మాణము జరిగినదని జనశ్రుతి. ఈ ఆలయములోని మూలవిరాట్టు తౌరుష్కుల దౌర్జన్యముల వలన భగ్నమగుటచే రాయలవారు పునః ప్రతిష్ఠింపజేసి యుందురని మన కొండూరి వారి తలంపు. హంపి (విజయనగర) విరూపాక్షాలయ పద్ధతిన నీ ఆలయ శిల్పము చెక్కబడినది. ఇచటి కల్యాణ మండపము చూడసొంపు. ఇందు నొక్కే శిలాస్తంభమున వృక్షశాఖలవలె మూడు చిన్న స్తంభములు చెక్కబడిన దృశ్యము చూడదగినది. హంపిలోని సప్తస్వర స్తంభములవలె నిచ్చటకూడ నొక స్తంభము నుండి ధ్వనులు వినిపించును. ఇట్టి

విచిత్రాద్భుత శిల్పములు రాయల ఆస్థాన శిల్పాచార్యుడైన "వేంకటాచార్యు" డాకాలమున సృష్టించెడివాడని ప్రఖ్యాతియుండుటచే నా మహాశిల్పియే తన పర్యవేక్షణలో నిర్మింపజేసి యుండునని వ్యాస రచయిత గారి అభిప్రాయము.

ఇక తాడిపత్రిలోని బుగ్గ రామేశ్వరాలయమున ప్రతిష్ఠమైన శివ లింగమును గూర్చియొక గాథ యిట్లు చెప్పికొందురని ఆచార్యులు గారు వచింతురు. "బుగ్గ"యను పదమునకు నీరూరుటయని అర్థము కలదు. జలములెటు నుండి ఊఱుననగా పానవట్టమున వెలయు లింగము యొక్క అడుగు భాగము నుండి నిరంతరము నీరూరు చుండును. ఈ కారణమున నీ స్వామికి బుగ్గరామేశ్వరుడని ప్రఖ్యాతి కల్గినది. శ్రీ రామచంద్ర ప్రభునిచే నీ లింగ ప్రతిష్ఠ జరిగినందు వలన రామేశ్వరుడుగా ప్రసిద్ధిగాంచినాడని లోకవాచ. ఇట నింకొక విశేషము కలదు. లోకమున దేవాలయములెల్లెడల పూర్వాముఖమై యుండ నిట పశ్చిమాభిముఖముగా నుండుట గమనింపదగినది. అష్ట దిక్పతులలో పశ్చిమ దిశాధిపతి వరుణదేవుడగుట వలన కానగును ఇచట లింగప్రతిష్ఠాపక శిల్పాచార్య, దద్దిశాధిపతి యొక్క గుణ, లక్షణ, నామ విశిష్టతలు సహజ వాస్తవములని లోకమునకు తెలియ పరచుటకై జలములూఱునట్లు, తన శిల్ప రహస్యముల నిందుజొనిపి స్థాపించి యుండునని నా తలంపు ఇట్టి శాస్త్ర రహస్యము లలనాడే గాక నేడును శిల్పవిజ్ఞులు చూపుచునే ఉన్నారు. శ్రీకాళహస్తిలోని లింగము వాయులింగమనుటకు మనమీనాడు కూడ ఆలయదీప చల నము చూచుచునే ఉన్నాము కదా ! ఇట్టి అనన్య శిల్పనైపుణ్య చిత్ర విచిత్రము లెన్నియో మనదేవతా క్షేత్రముల వైభవమును చాటుచును టలో సందియములేదు.

మన దర్శనాచార్యు లేదేవాలయమునె గాని, ఏ శిల్పమునెగాని ఏ విగ్రహమునేగాని తుదకు గోపురమునేగాని దర్శించునప

కాని ఆలయ కుడ్యముల మీద ద్రౌపదీ వస్త్రాపహరణాది భారత కథాచిత్రిత శిల్పములుండుట కడు విచిత్రమని వ్యాసకర్త శ్రీ వీర రాఘవాచార్యులు భావించినారు. రాయల నాటి దేవాలయములగుటచే, రాయలవారు విష్ణుభక్తు డయ్యును శైవ భక్తులకు, శైవ దేవాలయములకు ప్రోత్సాహ మొసంగి తమ శివకేశవాభిన్నత ప్రకటించినాడని వీరరాఘవాచార్యులు తమ రచనల ద్వార గ్రహింపచేసినారని తెలియును.

## అహోబలాది ఇతర క్షేత్రములు

"జ్వాలాహోబల మాలోల క్రోడా కారంజ భార్గవాః
యోగానంద చ్ఛత్రవట పావనా నవమూర్తయః"

అను తొమ్మిది నరసింహస్వాముల ఆలయ క్షేత్రములు ప్రసిద్ధములు. ఈ తొమ్మండుగురతో దిగువ అహోబలమున - భార్గవ నరసింహ, యోగానంద నరసింహ, ఛత్రవట నరసింహ యను మూడు ఆలయములును ఎగువ అహోబలమున తక్కుంగల దేవాయతములును కలవు. వీటిలో వైష్ణవ ధర్మప్రసిద్ధమైన అహోబల నరసింహస్వామి ఒకరు. అహోబల నరసింహస్వామి వేంచేసియున్న కొండ ఎగువ అహోబలమున కైదారు మైళ్ళదూరమున కలదు. అచటి నృసింహమూర్తి ఒక కొండ చీలికతో దర్శన మిచ్చును. పురాణములలో వర్ణిత నరసింహస్వామి హిరణ్య కశిపుని గృహమున నొక స్తంభమును చీల్చి ప్రకటితులై ప్రహ్లాదునకు దర్శన మిచ్చిన కథను స్మృతి పథమున మెదలునట్లు ఈ నరసింహమూర్తి కూడ కొండ గుహ చీలికలో కనబడును. ఈ నరసింహమూర్తిని గూర్చి పురాణ కథ రచింపబడినదో, లేక పురాణము ననుసరించి ఇచటి

మూర్తి వెలయింపబడినదో ఊహింపజాలము ఏది యెట్లున్నను శత శతాబ్దములనుండి శ్రీ మద్రామానుజాచార్యులు, వేదాంత దేశికులువంటి మహనీయులెందరో ఈ నృసింహస్వామిని దర్శించి స్తోత్రములు, రచనలు చేసినారు మహాభారత రచయితలలోని ఎఱ్ఱాప్రెగ్గడ ఈ నృసింహస్వామిని గూర్చి యొక మహాప్రబంధమే "నృసింహ పురాణము" అను పేరిట రచించిన విషయ మాంధ్ర లోకమునకు విదితమే కదా।

ఈ అహోబిలాలయ ముఖభాగమున నొక మహా మంటపము కలదు. అది చౌపష్టి (అరువది నాలుగు) స్తంభములతో నత్యంత సుందరముగా నిర్మింపబడి, కల్యాణమంటపమని పేర్కొంచినది. ఆ స్తంభములన్నియు వర్ణనాతీత శిల్ప నైపుణ్య ప్రభలతో విరాజిల్లుచు అలరారుచున్నది. స్తంభస్థమూర్తుల ముఖాంగావయవాదు లత్యంతాకర్షణీయ లోకోత్తర శిల్పమును ప్రకటించునవియని దర్శనాచార్యులు వర్ణింతురు.

కాకతీయ ప్రభుడగు ప్రతాపరుద్రుడిట విడిదిగా నిర్మించుకొనిన "రుద్రవర" మను గ్రామ మీ క్షేత్రమునకు దగ్గరలోనే యున్నది.

ఇక "మహానంది" క్షేత్రమును మన వీరరాఘవాచార్యుల వారు సందర్శించి క్లుప్తముగా వచించిన విషయములిట్లు కలవు. మహానంది ఒక శైవక్షేత్రము. అలంపురములోని నవబ్రహ్మలవలె నవనందులనబడు-బ్రహ్మ, విష్ణు, రుద్ర, సూర్య, సోమ, నాగ, గరుడ, మహనందులతో నీ మహానంది ప్రసిద్ధ క్షేత్రము. ఈ క్షేత్రము శ్రీశైలమునకుపోవు మార్గమున నంద్యాల తాలూకాలో కలదు. విస్తృతోన్నత శ్రీశైలము యొక్క అడుగుభాగమున నదివెలయుచున్నది. నందీశ

రుని విగ్రహము తన జీవకళల పొంగుచు నాటిశిల్పాచార్యుని నేర్పరి తనమును ప్రకటించుచుండును.

అర్థశాస్త్రవేత్తయైన చాణక్యునిచే శప్తులైన "నవనందులు" రాజులుగా నుండిరని చరిత్ర రచయిత లెరిగిన విషయమే ఆ తొమ్మండుగురలో మహానందుడను వాడీ నందీశ్వరుని నిల్పినట్లును, ఆ నందితోపాటు తన సోదరుల పేరిట మరి యెనిమిదినందులను స్థాపించి, వాటికి నవనందులని పేరిడియుండునని, కొందఱి అనుమానము. (ఇది పరిశోధనీయాంశము)

ఇట పేర్కొనబడిన నవనందులలోని బ్రహ్మ, విష్ణు, రుద్రుల పేరిట మూడు కుండములు వెలయుచున్నవి. వాటిలో రుద్రకుండ మొక విశేషమును తెల్పును. ఈ కుండమున నలువైపులు సోపానములు గలిగి, అందులోనికి నంది ముఖము ద్వారా సర్వదా జలము ప్రవహించుట ప్రత్యక్షముగా శ్రీ వీరరాఘవాచార్యులు కాంచినారు. వారి నిశిత పరిశీలనలో తేలిన విషయము నిట్లు వాకొన్నారు. ''ఆలయపు అడుగు భాగమున ప్రకృతి సిద్ధమైన "జల" అనగా ఊట ఉండి యుండును. ఆ జల ప్రవాహ ముఖమున నొక మహా శిల్పి తన శిల్ప కౌశల చమత్కృతితో నొక నంది ముఖమును చెక్కి, అమర్చి యుండును. ఆ శిల్పాచార్యుడు కూడ సమీపమునందలి ''గుంపరమాను తిన్నె"యను గ్రామమునందుండిన శిల్పులలోనొకడై యుండుననియు, ఆ నంది ముఖము నుండి జలము లూరుచుండుటచే నా క్షేత్రమునకు "మహానంది" నామము ప్రఖ్యాతమై యుండునని" ఆచార్యుల తలంపు. దీనిని శిల్ప విజ్ఞతానైపుణ్యమనక మరేమన గలము, ఈ విషయ వివరణమంతయు మన ఆచార్యుల వారి

యొక్క [illegible] శాస్త్రదృష్టికి [illegible]ణము కాదా! ఆచార్యుల వారి వ్యాసావళి గురించి యింకెన్నియో తెలుపవలసియున్నను, గ్రంథ విస్తరభీతిచే యింతటితో నీ ఘట్టమును ముగించి, వీరి సంఘ సేవా నిరతిని కొంత తెలిసికొందము.

## విశ్వ బ్రాహ్మణ ధర్మపీఠము

విశ్వ బ్రాహ్మణ బ్రాహ్మణత్వోన్నతిని కొందరు గుర్తించ కుండ, మరికొందరు గుర్తించియు అసూయతో అపహేళన ధిక్కార ములతో, ప్రతిపక్షులైనచో విశ్వకర్మ బ్రాహ్మణులకు విఘ్నకారకు లగుటవలన ఆ విఘ్నకారకులను వీరు శ్రుత్యాగమ సాహిత్యశిల్ప విజ్ఞా నము యొక్క కాంతిచే కనులు తెరిపించుటకై విద్యాప్రకాండులగు సర్వబ్రహ్మశ్రీ యులవర్తి అంజనేయశాస్త్రి గారు, వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు, గొట్టుముక్కుల వరహా నరసింహ్మశాస్త్రిగారి వంటి వారెం దరో తమ వేదవిజ్ఞతతో శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి వంటి వారినెదిరిం చుటయు మరియు [illegible] తన పొరపాటును తెలిసికొని కృష్ణమూర్తి [illegible] ఒప్పుకొనుట జరిగిన వివరములు అప్పటి విద్వాంసులు [illegible].

[illegible] ఉపద్రవాల నెదిరికొనుటకై క్రీ. శ. 1974లో విశ్వ బ్రాహ్మణ ధర్మపీఠము నూజువీడులో స్థాపింపబడినది. అప్పుడు బ్ర. శ్రీ. [illegible] మూడవాచార్య, సభాపతిగాను, బ్ర. శ్రీ. కొండ[illegible], [illegible] మరియు బ్ర. శ్రీ. దురిసేటి వేంకట రామా[illegible]గాను నియుక్తులైనారు. ఈ ధర్మపీఠము [illegible] చేయుచున్నది. దర్శనాచార్యులు (కొండపాటూరు వారు) ఈ ధర్మపీఠమున కనేక సంవత్సరములు అధ్య

షులుగానుండి, పీఠము ప్రచురించు "ప్రబోధ తరంగిణి"లో సంఘీయు లను ప్రబోధించుచు ఉత్తేజపరచుచున్నారు. ప్రస్తుతము ధర్మపీఠము నకు గౌరవాధ్యక్షులుగా తమ అమూల్యమైన సలహాలతో సంఘమును సేవించుచున్నారు.

ఇక ఇంతకుమించిన ఆచార్యుల బృహత్తర పరిశోధిత విజ్ఞాన సేవానిరతి కొలదిపాటి చవిచూతము—

## ఋగ్వేద - యజుర్వేద దిగ్దర్శనములు

ఇంతవరకు అనన్యచాతుర్యము గల మన కొండూరి వీర రాఘవాచార్యులు, లోకమునందలి శిల్ప సంబంధ విషయ విజ్ఞాన మును, శిల్పాచార్యుల సృజనా నైపుణ్యవైభవమును వెలువరించి మనలను త్తేజపరచినారు. ఇపుడు జగచ్ఛిల్పి యొక్కయు, జగ చ్ఛిల్పము యొక్కయు తమ దర్శన విశిష్టతను తెలుపబూను చున్నారు. అద్దానిని కొంతలోకొంతయైన తెలిసి ఆనందింతముగాక.

ఆచార్యుల వారు వేద వేదాంతోపనిషత్సారమాస్వాదించి ప్రస్థానత్రయ వైశిష్ట్యమును గ్రహించినవారు వీ రేవిషయమును, నే వస్తువును చూచినను తమ అంతర్దృష్టితో నత్యంత గంభీరముగా నవలోకించి ఆలోచించి, అందలి వాస్తవికసారమును గ్రహించి అద్దాని ప్రాముఖ్యమును లోకమునకెరుక పరతురు. ఎరుక పరచెడు తమ అన్వేషితభావములకు సమర్థనీయమైన వేద వేదాంగములందలి సూక్త సూత్రముల నుటంకించి సమన్వయ పరుతురు. అందువలననే వారి ఋగ్వేద దిక్దర్శనములతో, యజుర్వేద దిక్దర్శనములలో నడుగడుగున స్వల్పాతి స్వల్పమైన భావములకు సైతము వేదమంత్రములు దర్శనమిచ్చుచుండును. ఆయా మంత్రములయొక్క

సాయణాచార్య యాస్కాచార్యుల భాష్యములందలి సామాన్యభావము లనేగాక నిగూఢార్థముల లోతునకు వెళ్ళి తమ హృదయభావమును వెలువరింతురు. ఉదా :- విశ్వకర్మ పదములోని "విశ్వ" మను మాటకు సమస్తార్థమును వివరించుచు విశ్వకర్మ సూక్తాంతర మంత్ర భావమును తెలిపి వేదప్రమాణమును ఎత్తి చూపినారు. "ఏకం సత్ విప్రాబహుధావదన్తి"—ఏకైక సత్యమగు "సత్" అను పరబ్రహ్మ మును విజ్ఞులు అనేక నామములతో పలికెదరను ఋగ్వేద వర్ణిత విష యమును విశ్వకర్మ, రుద్ర, విష్ణు, ప్రజాపతి, పురుషుడను విభిన్న నామములుగా వేద ఋషులు వచించినారని ఆయా సూక్తములను ప్రమాణములుగా చూపినారు. ఈ విషయమునే తమ ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున విపులముగా చర్చించి, ఆ భాగమునకు "ఏకం సత్" అని నామమిడినారు. (జిజ్ఞాసువులాగ్రంథమును వివిర ముగా చూడనగును)

ప్రథమ భాగము :- ఏకంసత్ — అను "సత్తు", మాయా సంగమము వలన, బహువిధ రూపాత్మక ప్రపంచకముగా (విశ్వ ముగా) వ్యక్తమైనదని శ్రుత్యాగమోపనిషత్తులు నుడువుచున్నవి. అట్టి సత్‌ను వేదవేత్తలనేక రూపములతో ప్రస్తుతించినారు. బహుధా వదన్తిగా వర్ణింపబడిన 'సత్' పదార్థమును అనగా 'ఆత్మ'ను పురుష, విష్ణు, రుద్ర, విశ్వకర్మగా ప్రథమ భాగమున చర్చించి తరిచి, విశ్వోపకారకులైన ఇంద్రాగ్ని యమవరుణాదులెల్లరు, ఆ 'సత్త'ను బ్రహ్మముయొక్క రూపాంతరులని ప్రమాణములు చూపి, పరబ్రహ్మ పంచాననోద్భవులైన పంచ బ్రహ్మల పంచక్రియల పంచమూర్తుల పంచశక్తులచే నీ సృష్టి (విశ్వము) జరిగిన ఆచార్యులు దర్శించి వివరణ పూర్వకముగా విశదీకరించినా ఇంద్రాగ్ని వరుణాదులెల్లరును ఆ సత్పదార్థ పరమాత్మలోని

యగుటచేతను, ఏకం సత్- ఆ ఒకే ఒక సత్తు సర్వరూప వస్తు వ్యాప్తమై యుండుటంజేసి, ఆ సత్తును అరటిపండు పొట్టు ఒలిచి తీసినట్లు ఎంతో సులభముగా చక్కగా నిరూపించినారు

## ఋగ్వేద దిగ్దర్శనావిష్కరణము

ఆచార్యులవారి ఋగ్వేద దిగ్దర్శనమందలి ఈ ప్రథమ భాగములోని విషయ వివేచన మత్యంత విశిష్టమైనది. ఈ కాలమున ఋగ్వేదమని విన్నవారేకాని అందలి విజ్ఞానము నెఱిగినవారు చాల అరుదు. ఆ విజ్ఞాన భాండాగారమునుండి రచయితగారు వివిధ దిక్కులనుండి మణులను వెలికితీసి ప్రకాశింప జేసినారు. ఆ ఉజ్వల ప్రకాశము మన ఆంధ్రప్రదేశ రాష్ట్ర పాలకులు (గవర్నర్)గారి వరకు ప్రసరించినది అప్పు డద్దానిని గూర్చి ఆచార్యులతో నిష్టా గోష్ఠి సలిపి గ్రంథకర్తగారి మేధాకృషికి ఆశ్చర్యానందములు ప్రకటించినారు. గవర్నర్ డా॥ శంకరదయాళ్ శర్మగారు. స్వయముగా భారత సంస్కృతీ సాహిత్యాభిమానులేగాక వేదవేదాంగ విజ్ఞులగుటంజేసి ఈ ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమును క్రీ. శ. 1985 లో సాదర, సహృదయతతో నావిష్కరించినారు. దీనినిబట్టి గవర్నర్‌గారి, విద్వజ్జనాభిమాన హృదయమెంత ఉదాత్తోజ్వలమైనదో, గ్రంథకర్త వీరరాఘవాచార్యుల వేద విజ్ఞత యెంతగా గంభీరోజ్వలమైనదో మనకు తెలియుచున్నది కదా! వీరి ధీశక్తికింత కంటె మించిన సాక్ష్యమవసరమా? ఇట్టి, రాష్ట్ర, రాజపూజితులీ కొండూరుగారు. (గ్రంథావిష్కరణ ఛాయాపటము వీరి దర్శనాదుల వెనుక పుటపై చూడనగును.)

ద్వితీయ భాగము: సర్వం ఖల్విదం బ్రహ్మ: ప్రథమ భాగమునందు ఏ 'సత్' పదార్థమునుగూర్చి "ఏకం సత్"గా నిరూ

పించినారో ఆ సత్ పదార్థమే విశ్వమునకు (సృష్టికి) ముందునుండి యుండి విశ్వమున కాధారమై, నానా రూపములతో సృష్టి ఉద్భవమునకు, కారణ కార్యములకు మూలమైనదో, అద్యైతియే సమస్త విశ్వముగా తానేయై "సర్వం ఖల్విదం బ్రహ్మ"గా వెలయుచున్నదను నుపనిషద్వాక్యమును శ్రీమదాచార్యులు తమ ఋగ్వేద దిగ్దర్శనముల ద్వితీయ భాగమున హేతుబద్ధముగా చర్చించినారు అందుకే యీ రెండవ భాగమునకు, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యని నామమిడినారు.

నామ రూపాత్మకమైన యీ సమస్త సృష్టికి పంచభూతములే ప్రధాన కారణమగుటవలన వాని ప్రాధాన్యతను వాకొని, దృష్టి గోచరమగు నానా వస్తు రూప జాలమును, అనగా అణువునుండి మహా విశ్వ బ్రహ్మాండమువరకుగల సకలము, సర్వ వ్యాపియైన పరబ్రహ్మ సత్ - పదార్థములోనివే యని పరిశీలించి, అయ్యదియే బ్రహ్మమని శ్రీ వీరరాఘవాచార్యులు వివరించినారు. అట్టి బ్రహ్మ సంభూతములను పంచభూతములే ఆధి భౌతికముగా ప్రారంభమై పృథివ్యప్తేజో వాయురాకాశములతో వెలసిన వానిని దేవతా స్వరూపములుగా వేదఋషులచే స్తుతింపబడిన మంత్రముల నుటంకించి ఆచార్యు లీ విశ్వము ఆధి దైవిక మనబడినదని వివరించినారు. ఆ ఆధి దైవిక తత్త్వమే వరుసగా ఆత్మయైన పరబ్రహ్మలోనిదే యగుటవలనను, సకలము ఆత్మచే నిబిడీకృతమగుటవలనను, ఆధ్యాత్మిక మనబడునని అన్నారు. ఈ అర్థము ననుసరించియే దర్శనాచార్యులు తమ ద్వితీయ భాగమునకు "సర్వం ఖల్విదం బ్రహ్మ" మని పేరిడినారన వచ్చును. ఈ వాక్యము నిట్లు భావించ వచ్చును. ఇదం = ఈ, సర్వం = సకలము లేదా సమస్తము, అనగా దృష్టికిని, మనస్సునకు గోచరమగునదెల్లయు, ఖలు = నిశ్చయముగా,

బ్రహ్మ = పరమాత్మయే ఇదియే వేదఋషుల భావము. ఈ భావమును తమ భావనాదృష్టికి సమర్థనీయముగా నాచార్యులు "వేద మంత్రముల నుదహరించుట సాధారణ విషయము కాదు. ఇది మన ఆచార్యుల వారికే తగుననుట సత్యదూరము కాదు.

తృతీయ భాగము : బ్రహ్మైవేదం విశ్వం : ఇక ఋగ్వేద దిగ్దర్శన తృతీయ భాగసారము నించుక గ్రోలుదము. దర్శనాచార్యులు తమ ద్వితీయ భాగమున సర్వము బ్రహ్మమే యను విషయము శ్రుతి సూక్త ప్రమాణముల ద్వారా, తమ అభిప్రాయ భావమును సమర్థపరచుకొనిన ప్రకార మీ తృతీయ భాగమున "బ్రహ్మమే ఈ విశ్వం" అను తమ భావమును నిరూపించినారు.

రెండవ భాగమునకును, ఈ మూడవ భాగమునకును విషయ చర్చాదులందే గాక గ్రంథనామమున నైతమంతగా భేదము లేదని తోచును కావి, రెండవ భాగమున "సర్వంబ్రహ్మ" మను వేద భావమునే యిందు నిశ్చయమని దృఢపరచి నిరూపించబడినది. అనగా భౌతికరూప బ్రహ్మభావమేదైతె శంకాస్పదముగా నుండి యుండెనో ఆద్దానిని చర్చించి ద్వితీయ భాగమున నిశ్చయమునకు వచ్చుట జరిగినది. ఇపుడీ మూడవ భాగమున, రెండవ భాగములోని నిశ్చితాభిప్రాయమును దృఢపరచి "బ్రహ్మైవేదం విశ్వం" బ్రహ్మమే విశ్వమని శంకారహితముగా దృఢ నిరూపణము జరిగినదని యనవలెను. బ్రహ్మభావదార్ఢ్యత కలుగునపుడే, విశ్వమునకు – బ్రహ్మమునకుగల భిన్నాభిన్నతలు తెలిసి మానవుడు నిత్యానంద ప్రాప్తినందగలడని తెలుపుటకే ఆచార్యుల వారి ఆకాంక్ష. అందుకే ఋగ్వేద దర్శన, పఠన, మనన, ఆచరణముల వలన బ్రహ్మైక్యానుభూతి పొంది, మానవుడు సంశయ విదూరుడగునని వచించి, ఆ మనన ఫలస్వాదులు

మోక్షదాయకములని నొక్కి వక్కాణించినారు. ఆ కారణముచేతనే తమ ఋగ్వేద దిగ్దర్శన తృతీయభాగమును ఋగ్వేదములోని మోక్ష సూక్త విశేషములతో నారంభించి, జగత్పితయైన "సవిత" యొక్క ప్రశంసయు, తరువాత కాల స్వరూపదేవతలుగా శ్రుతివర్ణిత సూర్య, త్వష్ట్ర మిత్ర, విష్ణు, పూష, వరుణాదుల ప్రాముఖ్యతను విశద పరచినారు. కాలమును, కాలాధీశులను జయించి (అధిగమించి) మనుజులు కాలాతీత పరమాత్మను పొంది అమృతులు కాగలరనెడి జ్ఞానమే యీ తృతీయ భాగమునందంతట వెలయింపబడినది. ఇట కాలమును జయించుట అనిన కుండలనీయోగ (ప్రాణాయామ) మార్గమున, మనుజుడు కాలాతీత పరమాత్మను తెలిసికొని మృత్యుంజయుడగునని ఆచార్యుల హృదయము.

ఈ భాగమును మోక్షసూక్తముతో నారంభించి, ఆ సూక్తములోని అనేక మంత్రములు, విష్ణు సూక్తమునందలి కుండలినీయోగ రహస్య మంత్రములుగా కనబడుచున్నవని గ్రంథకర్తగారు భావించినారు. మోక్షమనగా జనన మరణ పరిజ్ఞానము నార్జించి లోకాతీత వర్తనుడై మనుజుడు లోకమున మెదలుట. అనగా సృష్టికి (విశ్వ సృష్టికి) పూర్వమందుండిన సత్ పదార్థమును తెలిసికొనుటయని భావము. అదెట్టిదని చర్చించుచు ఋగ్వేద (1–164–4) మంత్రమున సృష్టికి పూర్వమున్న స్థితికి ఎవడు చూచినాడు? దానినెవడు వివరింపగలడు? అనుమంత్రమునుటంకించి,అందలిప్రశ్నలనువిస్తరించి,సృష్టికి పూర్వము శరీరధారియైన జీవి ఉండలేదని, మంత్రములోని ప్రశ్నార్థక "క్వసిత్" పదము నుండి గ్రహించి, "ఆత్మ" తప్ప మరేదియు లేదని తెలియుచున్నదని ఆచార్యులు వచించి దృఢపరచినారు. ఈ రహస్యమెవ తెఱుంగుదురను మరొక భావమునకు సమాధానముగా ఋగ్వేద (1–164–5) మంత్రము ద్వార ఇదివఱకెవరీ సృష్టికి

పూర్వపుస్థితికి పూర్వస్థితిని యెరుంగలేరనుంది తేల్చి సాధకుడైన వాడు కుండలినీశక్తి పయనించులోకముల (చక్రముల) ద్వార ఆత్మ తత్త్వము నెఱుంగ వచ్చునను తమ భావమును వెలువరించినారు. ఈ కారణముననే పైన మోక్షసూక్తములోని మంత్రములు కుండలినీ యోగ రహస్యములుగా కనబడుచున్నవని వచించి, ఆత్మతత్త్వ మెఱుంగుటయే సృష్టికంటె మొదటి స్థితియను దానిని యెరుంగనగు నని అదియే మోక్షమును (ముక్తిని) ప్రాపించజేయుననెడి నిగూఢార్థమే వేదము యొక్క అభిమతమని ప్రకటించినారు.

ఇక వేదమునందలి కాలతత్త్వ స్వరూపమునుగూర్చి శ్రీకృష్ణ భగవాను దర్జునునకు దశమాధ్యాయమున కూడ "తానే అక్షయ కాల స్వరూపుడనియు, నట్టికాలమువల్లనే సృష్టిస్థితిలయాదులు జరుగు చున్నవని తెలిపిన బోధమునకు, ఆచార్యులవారు ఋగ్వేద ప్రథమ మండలములోని 164వ సూక్తాంతర పదునొకండవ మంత్రమును ఆధారముగా గొని, సంవత్సరమనెడి కాలమను దానికి గల సంబంధము సమన్వయపరచి, కాలము "సూర్యు"ని వలన నేర్పడుటచే సూర్యుడు కాలస్వరూప దేవుడుగా నిరూపించినారు. ఇటులే సవితా దింద్రవరుణాశ్వినీ దేవతల దేవత్వమును చర్చించి పరతత్త్వమును విశదపరుపబడినది. ఈ విశదీకరణముచే ఈ విశ్వరూపమెల్లయు "బ్రహ్మ"మేయని నిరూపితమగుచున్నది. శ్రీ మదాచార్యులు తమ పరిశీలన సారాంశమును కుండలినీయోగ చర్చ ద్వారా "సహస్రార విద్య" యనునది మోక్షదాయకమనునర్థముతో సమన్వయపరచి ఋగ్వేద దిగ్దర్శన తృతీయ భాగమును మంగళాశాసముతో పరి సమాప్తి యొనర్చినారు.

ఒక ముఖ్యమైన ఆచార్యుల వారి పరిశోధిత, విషయమీసందర్భమున తెలుప విస్మరింపబడినది. అందుకు చింతించుచున్నాము.

అదేమనగా లోకమున ముప్పదిమూడు కోట్ల దేవతలున్నారని పామ రాది పండితుల వరకు పలింతురు. కాని ఇది వేదసమ్మతము కాదని ముప్పది ముగ్గురు మాత్రమేయని వేద ప్రమాణములతో నిరూపించి నారు. అదెట్లనగా యీ విశ్వము కేవలము (33) ముప్పది ముగ్గురు దేవతలచే సాగుచున్నది. ఆ ముప్పది మువ్వురలో (11) పదు నొకండుగురుద్యులోకమునను, (11) పదునొకండ్రు భూలోకము నను, ఇంకొక (11) పదునొకండుగురు అంతరిక్షమునను వెలయు చున్నారు. వారెవరెవరనిన–అష్ట (8) వసువులు (వీరు విశ్వమును వసింపజేయుచున్నారు కాన వసువులనబడుదురు) ఏకాదశ (11) రుద్రులు (ఆత్మ మరియు దశేంద్రియములు), ద్వాదశ (12) ఆదిత్యులు (వీరు పండ్రెండు నెలల కధిపతులు) మరియు ఇంద్ర ప్రజాపతులిరువురు ఇట్లు వెరసి ముప్పది మువ్వురు దేవత లీ విశ్వ మును నడుపుచున్నారు. కావుననే ముప్పది మువ్వురు దేవతలనుటయే వేదోద్దేశమని విశదపరచి ఈ దేవతలు బ్రహ్మ స్వరూపులని రాఘవా చార్యులు నిరూపించుటచే నీ తృతీయ భాగమునకు నిస్సందేహముగా "బ్రహ్మైవేదం విశ్వం" అనునామము సార్థకమైనది. దర్శనాచార్యుల వారి అనన్యతపోబల సంపద ఇట్టిదని వేరే చెప్పవలయునా?

ఇంక వీరి మరొక గ్రంథము "ఋగ్వేద రహస్యములు." ఆ రహస్యాల నించుక చవిచూచి మనజ్ఞానమును వృద్ధిపరచు కొందము గాక.

## ఋగ్వేద రహస్యాలు

ఇంతవరకు శ్రీ వీరరాఘవాచార్యులు ఋగ్వేద మంత్రముల యొక్క విశేష విజ్ఞాన విషయక భావములను వివిధ దృక్కోణము లలో నవలోకించి, చర్చించి ''ఏకం సత్'' అను నొకే యొక ఆత్మ

(విశ్వకర్మ) సృష్టికర్మమునకు కర్తగా వెలయుచున్నదని, ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమును, తదనంతరము చరాచర విశ్వమెల్లయు బ్రహ్మమయమని "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను మాటను ధృఢ పరచి రెండవ భాగమును, తదనంతరము "బ్రహ్మైవేదం విశ్వం" అను నుపనిషద్వాక్యమును తలచి పరిశీలించి పరబ్రహ్మ పరమాత్మయే విశ్వరూపాకృతి దాల్చినదను విషయము తెలిసికొని మూడవ భాగమును విరచించి వెలయించినారు. ఐనను వారికి ఇంకను వేద విషయమున తనివితీరిక ఇంకను ఋగ్వేద సాగరమీది అందలి అమూల్యములైన మణులింకేవేవి కలవో వెలికి తీయవలెనను తృషచేనా వేదము నిదివరకంటెనధిక శ్రద్ధతో మథించి అందలి రహస్యములను వెలికిదీసి లోకమున ప్రకాశింపజేసినారు అయ్యదియే "ఋగ్వేద రహస్యాలు" అను మరొక గ్రంధము. ఈ గ్రంధమును రచించి పూర్వ ఋషులవలె వీరును ఈ కాలమునొక ద్రష్టగా ప్రస్తుతులైనారనిన సందేహము లేదు. వీరి ధీ దృగ్గోచర రహస్యములన్నింటిని వివరించుట యశక్యమేగాక వలనుపడని పని. కావున నా రహస్యాల లోని యొకటి రెంటిని మచ్చునకు స్వల్ప మాత్రము తెలుప ప్రయత్నింతును.

ప్రప్రథమమాచార్య లీ గ్రంథమును వేదజననీ జనకులైన గాయత్రీ విశ్వకర్మాది దైవ ప్రార్థనతోనారంభించినారు. ఇందు మొట్ట మొదట ఋగ్వేదములోని "త్ర్యంబకమంత్రమును" స్వీకరించి చర్చించినారు. అందలి 'అంబక' శబ్దమును నేత్రములుగా గ్రహించియును, విశ్వకర్మ సూక్తమున గల "చక్షుషఃపితా" అను పదము నేత్రాదింద్రియములేగాక "జనకు"డని వచించిన భాష్యకారుల అంతరార్థమెయ్యదియో ఆ యర్థమునే సప్తర్షి శ్రేష్ఠులలో నొకడగు వసిష్ఠ

మహర్షి కూడ విశ్వకర్మయే జగత్పితయని సమర్థించి స్పష్టపరిచి యుండెనో, ఆ రహస్యమును ఆచార్యులు వెలికి తీసినారు.

ఇక "త్రి" యనునది సంఖ్యా వాచకమని అందరెఱిగినదే త్ర్యంబకుడను పదము సూర్యచంద్రాగ్నులు ముగ్గురును నేత్రములుగా గలవాడని శివుని గూర్చి పౌరాణిక బాహ్యార్థము కూడ అందఱెఱిగినదే. ఈ త్ర్యంబకుడు మోక్షప్రదాతయని, శుభంకరుడని, సర్వేశ్వరుడని శ్రుతులు వర్ణించినవి. కాని, మన వీరరాఘవాచార్యుల బుద్ధికి ఈ "త్రి" అనునది కుండలినీ యోగలక్షణ లక్ష్యములను సూచించు ఇడా-పింగళ-సుషుమ్నా-నాడులుగా గోచరించినవి. ఈ మూడు నాడుల ద్వారా ప్రాణాయామసాధకులు తమ హంసను (శ్వాసన-ప్రాణమును) ఇడా-పింగళ-సుషుమ్నముల ద్వారా రేచక పూరకములు సల్పి, ఆ హంసను సుషుమ్నమున కుంభక మొనర్చి, పరమేశ్వర (పరమేశ్వరి) సాన్నిధ్యము నొంది సాధకుడు నిశ్చల నిర్మలానందోదధిలో నోలలాడును. ఈ నిర్మలానందమే మోక్షదము అట్టి నిశ్చలానంద మగ్నతయే బ్రహ్మానందామృతములో నోలలాడుటయగును. అప్పుడు జీవుడు పరమాత్మలోలీనుడై అద్వైత స్థితినందును. ఆ పరమాత్మయే జగత్పిత. ఆ జగత్పితను తెలిసికొనినవానికే జీవబ్రహ్మైక్య భావము కుదురును. త్ర్యంబక శబ్దములోని నిగూఢార్థమే యౌగిక సంబంధమైనట్టి కూటమనబడు అర్థమే కాని, వేరుకాదని దర్శనాచార్యుల భావరహస్యము.

మరొక అర్థమున కూడ "త్ర్యంబక" పదమును నిర్వచించుటకు వచ్చును. జీవుడనువాడు స్థూల, సూక్ష్మ, కారణత్రయ శరీరములు గలిగి యున్నాడనునది యోగులు, వేదాంతులు, తాత్త్వికులెరుగుదురు. ఈ 'త్రి' శబ్దము త్రిలోకార్థమున స్వర్గమర్త్య

పాతాళములనియు లేదా పృథివ్యంతరిక్ష స్వర్గములుగా భావింపబడుచో నీ లోకములను సృష్టించినవాడు త్రిలోక జనకుడగు త్ర్యంబకుడుగాక అన్యుడెవడు? మన మిదివరకు సృష్టికర్తయనువాడు విశ్వకర్మయని తెలిసికొన్నాము. ఆ విశ్వకర్మకును త్రినేత్రములు కలవని శ్రుతి వర్ణించినది. కాన నీ మంత్రమున విశ్వ స్రష్టయైన విశ్వకర్మయే త్ర్యంబకుడుగా వర్ణితుడైనాడనుట సుస్పష్టమని దర్శనాచార్యులు, ఈ మంత్రమునందలి భావరహస్యమును ప్రకటమొనరించినారు. ఈ త్ర్యంబక మంత్రమును మృత్యుంజయ మంత్రమని కూడ వచింతురు. మృత్యుంజయ మంత్రము అనగా యోగాభ్యాసకులు తమ కుంభిత హంసను వ్యర్థపుచ్చక ప్రాణమును పొడుగించుకొనుటయేగాక మృత్యువును తమ వద్దకి చేరనీకయుండవచ్చునని యోగశాస్త్రము తెల్పుచున్నది కాననిది మృత్యుంజయ మంత్రమనుట కూడ సమర్థనీయమే. ఈ మంత్ర జపము వలన వాస్తవముగ మనుజుడు మృత్యుంజయుడగునని దర్శనాచార్యుల వారు తమ స్వానుభవమునిట్లు వాకొన్నారు.

> "తామొక పర్యాయ మత్యంత ప్రమాదకర జాడ్యముననున్నపుడు డాక్టర్లు బంధువులు మున్నగు వారందరు నిరాశకులోనైనారు. అప్పుడాచార్యుల వారు మాట్లాడ వీలులేని స్థితిలో నీ మృత్యుంజయ మంత్రమును తమ ఉచ్ఛ్వాస నిశ్వాసలతో జపించుచుండ కొంతకాలమునకా ప్రమాదము తొలగి స్వస్థత చేకూరిన"దని వారి విశ్వాసము. ఉందువలన వారీ మంత్ర

ముతో గ్రంథమారంభించి లోక కళ్యాణము చేకూర్చనభిలషించినారు. వేదమంత్రములిట్టి ప్రభావ గర్భితములని లోకమునకు చాటి తమ స్వానుభవముతో ధృవపరచినారు.

ఇక జీవేశ్వరులను గూర్చి మన కొండూరి వారి అభిప్రాయ మును కొంత తెలిసికొందము.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా............

అను శ్రుతి నుటంకించి, సంసారమనెడి వృక్షముమీద రెండు పక్షులు (జీవుడు-ఈశ్వరుడు) కలవు వాటిలోనొకటి జీవుడు-ఆ చెట్టుయొక్క కర్మ ఫలముల ననుభవించుచుండ, నింకొక (ఈశ్వరుడు) పక్షి కేవలము చూచుచు నున్నది. ఈ రెండు పక్షులను వేదము బ్రహ్మాండ పాలకులుగా ఇంద్రవిష్ణువులుగా వర్ణించి, పిండాండ పరముగా ని రెంటిని జీవేశ్వర ప్రతీకలుగా వర్ణింపనాచార్యులు నీ రెంటినిజీవేశ్వర స్వరూపములుగా గ్రహింపవలెనని మంత్రములోని నిగూఢ రహస్య మును వెలువరించినారు. శుక్ల యజుర్వేదమున నింద్రుడు విశ్వకర్మ గాను, విష్ణుడు విశ్వకర్మతుడుగాను వర్ణింపబడినారు ఇయ్యదియే ఇంద్రొపేంద్రుల స్వరూపని దర్శనాచార్యుల అభిప్రాయము.

వాక్కు-వాచస్పతి :-"వాక్కు-వాచస్పతి" శీర్షికలోకొండూరు వారి అంతరార్థమిట్లు కలదు. "వాక్కు" సరస్వతిదేవియని స్త్రీ దేవతగా ఋగ్వేదము స్తుతించినది. ఆ వాగ్దేవిని ప్రప్రథమమున దేవతలు గుర్తించినారు. "వాక్కు" అనగా వేదవాక్కనియు కూడ వేదజ్ఞుల భావము చాందోగ్యోపనిషత్తులో "గాయత్రి"యే వాగ్రూపిణిగా చెప్ప బడినది. "వాగ్వై గాయత్రీ వాగ్వాఇదగ్ం సర్వం" అని వచింప బడుటచే గాయత్రియే వాగ్దేవి యని స్పష్టము.

ఇక వాచస్పతి (వాక్పతి) అనగా బృహస్పతియైన బ్రహ్మ లేదా త్వష్ట లేదా విశ్వకర్మ యనియే వేద భావముగా నాచార్యులు తమ పూర్వ దిగ్దర్శనములలో తెల్పినది తెలిసికొని యున్నాము.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" యని (ఋ-10-81-7)ఋగ్వేదము స్పష్టపరచినది. కాన వాచస్పతి విశ్వకర్మయే యనుటకు సందేహము లేదు కాన వాక్-వాచస్పతులు గాయత్రీ విశ్వకర్మలని అనుటయె వేద వాఙ్మయ భావము అందుకే "గాయత్రీం వేద మాతరం" అన్నారు ఇయ్యదియే లోక వాఙ్మయమున ప్రకృతి పురుషులు,

జడ చైతన్యక్రీడ :- జడ చైతన్యక్రీడయను శీర్షికలో ప్రకృతియే జడమని, పురుషుడే చైతన్యమని, ఈ రెండింటి కవినాభావాద్వైతము ప్రకటించి, జడము వినా చైతన్యము, చైతన్యము లేనిది జడము క్రీడింప నేరదు. ఈ జడ చైతన్యములే సృష్టికి కారణమైన ప్రకృతి పురుషులుగా చెప్పబడుననదియే గాయత్రీ విశ్వకర్మాద్వైత సిద్ధాంతమని ఆచార్యులు స్థిరపరచినారు.

బ్రహ్మ - విష్ణు-రుద్రులు :- ఈ దేవతాత్రయము క్రమముగా రజస్సత్వతమో గుణత్రయ సంయోగము వలన ప్రాదుర్భవించినారని తాత్త్వికులు వచింతురు రజస్సత్త్వతమో గుణములు అవ్యక్త మూల ప్రకృతిలోనివే యగుట వలన నీ త్రిమూర్తులు లేదా ఈ మూడు శక్తులు మూల ప్రకృతికి తరవాతి వారని తెలియనగును, ఈత్రిగుణములందలి రజోగుణము సకల పదార్థముల ఉద్భవమునకు, సత్త్వగుణము-రజోగుణశక్తిచే సుసృష్ట మైన వానిని పోషించుటకు. తమోగుణ మవ్యాసిలయమునకు ప్రధానకారణమగుటచే నీ మువ్వురలో రజోగుణుడైన 'బ్రహ్మ' సృష్టికి కారకుడైనాడు. అటులే సత్త్వగుణ యుక్తుడగు విష్ణుడు స్థితికి కారకుడు కాగా, తమోగుణ ప్రధానుడగు రుద్రుడు లయకారకుడైనాడని తెలియును. ఈ గుణత్రయ సంయోగము వల్లనే వారికా శక్తులు కల్గిన వనుట తేటతెల్లమేగాక మూల ప్రకృతి పిమ్మటి వారే యనుట నిర్వివాదము.

ఇది ఇటులుండ మూల ప్రకృతి కలుగక పూర్వము విశ్వకర్మ నామక పరమాత్మయే యున్నదని వేదములు తెలుపుచుండుట వలన నా విశ్వకర్మ పరమాత్మ త్రిగుణరహితమని తెలియునుకదా! అంతియే కాదు "సత్-అసత్" లకు అతీతమని నాసదీయ మరియు విశ్వకర్మ సూక్తములు సాక్ష్యమిచ్చుచున్నవి. కావున బ్రహ్మ విష్ణు రుద్రులు విశ్వకర్మయొక్క అంశజులని చెప్పకయే చెప్పుచున్నదని ఆచార్యుల పరిశీలనా రహస్యమని తెలియుచున్నది.

## విశ్వకర్మ-పురుష సూక్తముల తులనాత్మక పరిశీలన

పురుష సూక్తము, విశ్వకర్మ సూక్తములనునవి రెండును ఋగ్వేదమున కలవు. ఈ రెండు సూక్తములందును పరబ్రహ్మపరమాత్మను వర్ణించుచు స్తోత్రము చేయబడినవి. పరమాత్మను పురుష సూక్తమున పురుషుడుగాను, విశ్వకర్మ సూక్తమున విశ్వస్రష్టగాను వర్ణింపబడినది.

పురుషసూక్త ప్రథమ మంత్రము "సహస్ర శీర్షాపురుషః సహస్రాక్ష సహస్రపాత్................." అని ఆరంభమైనది. ఇందులో విరాట్ పురుషుడైన పరమాత్మను అనేకశిరస్సులు, అనేక నేత్రములు, అనేక పాదములు కలవాడుగా వర్ణింపబడినది. ఈ విరాట్పురుషుడే విశ్వాండము (బ్రహ్మాండము) లన్నింటిలో వ్యాపించి, "అత్యతిష్ఠద్దశాంగులమ్"గా దశదిశల యందు నిండి యున్నాడని ఋక్ వచించుచున్నది. ఈ మంత్రము వలన తెలిసినదేమనగా, ఈ పురుషుడే సర్వచరాచరరూప, ప్రాణులలోను వసించియున్నాడనియు, అతడే పరమాత్ముడని విదితమగుచున్నది.

ఇక విశ్వకర్మసూక్తము ఆ విరాట్పురుషుడైన పరమాత్మను "విశ్వతఃచక్షురుత విశ్వతోముఖో-విశ్వతో హస్తఉత విశ్వతస్పాత్ ................" అని వచించినది. అనగా ఆ పరమాత్ముడు విశ్వమంతట కనులు గలిగి, విశ్వమంతయు ముఖములు గలిగి, విశ్వవ్యాప్తముగా చేతులు కలిగి, విశ్వమెల్లను పాదములు గల్గినవాడై బ్రహ్మాండాదులనెల్ల సృజించినాడని ఈ మంత్రమున-సూక్తమున స్తుతింపబడినది. ఈ భావమునే పురుషసూక్త తొలి మంత్రము తెలిపినది. దీనిచే సృష్టికి కారణభూతుడైన పురుషవాచ్య పరమాత్మకును, విశ్వమును సృష్టించిన విశ్వకర్మ వాచ్యపరమాత్మునకు నెంత మాత్రము భేదము లేదని తేలినది. దీనినే విజ్ఞులైనవారు "ఏకంసత్ విప్రాబహుధావదన్తి" అన్నారు ఈ రహస్యమునే మన వీరరాఘవాచార్యుల వారతి విపులముగాను నిర్మల భావ హృదయముతోను నీ సూక్తద్వయములోని ప్రతిమంత్రమును, అందలి ప్రతి శబ్దభావసాదృశ్యములను తులనాత్మక దృష్టిచే పరిశీలించి, పురుష"డనినను, "విశ్వకర్మ" యనినను ఒకే పరమాత్మ కర్థమని, ఈ రెంటిలోని రహస్యమును వెలువరించినారు. పరిశీలనముల నెల్ల నిట నుటంకించుటనిన వారి గ్రంథమునే పునరావృతము చేయవలసివచ్చును. (విశేష వివరములకు మూలము జూడుడు.)

"త్రి" చక్ర "సప్త" చక్ర రహస్యము :- త్రిచక్ర, సప్త చక్రము లనగానేమి? యను ప్రశ్నమున కందలి అంతరార్థము నిట్లు వివరించినారు "త్రి-సప్త" చక్రములనునవి త్రిలోకములుగాను, సప్త లోకములుగాను గ్రహించుచో-త్రిచక్రములు "భూర్భువస్సువః" అనియు, సప్తపదముచే "భూః, భువః, స్వః, మహః జనః, తపః మరియు సత్యః అనియు గ్రహించనగును కాని త్రిలోకములు సప్త లోకములందలి వేయగుటచే లోకములుగా భావించుట పొసగదు, కాన

చక్రములుగానే గ్రహించవలసియుండునని ఆచార్యులవారి అభి ప్రాయము. ఇట యోగ పరముగా మనము చర్చించవలసియున్నది. విష్ణువును మనము "త్రిధాము"డని సర్వవ్యాపియని, పరమాత్మయని వాకొందుము. లోగడ బ్రహ్మవిష్ణురుద్రులు విశ్వకర్మాంశ స్వరూపులని తెలిసియున్నాము. ఆ విశ్వకర్మయే పురుషుడు. పురుషుడనగా హృదయ ధామముననున్నవాడని అర్థము. ఆ హృదయధామవర్తియే పోషక కర్తయనబడు "హంస"-ఆ హంసలోనే నీ చక్రములను అన్వయించుకొనినచో త్రి చక్ర సప్తచక్రముల రహస్యము తెలియగలము.

కుండలినీ యోగమున "హంస" ఆధార చక్రము నుండి ఎగసి అనాహతము ద్వారా ఆజ్ఞా చక్రము నధిష్ఠించుట యనునది సాధకులకు సూచితము. కాన "త్రి" చక్రము లనిన ఆధార, అనాహత, ఆజ్ఞా చక్రములని గ్రహించవలెను ఇదియే త్రి చక్రముల భావ రహస్యము. ఇక సప్తచక్రములనగా కుండలినీ యోగము సాధించువాని హంస 'భూ' లోక స్థానమనబడు ఆధారమునుండి క్రమముగా నూర్ధ్వముఖమున నెగసి "భూవర్లోకమనేడి జల భూత స్వాధిస్థానము చేరి తత్పరి అగ్నిస్థాన సువర్లోకమనబడు మణిపూరము నంది, అదే వరుసన మహాలోకమగు అనాహత చక్రముద్వారా ఆకాశభూతమునకు నెలవైన విశుద్ధ చక్రమును జేరి తదనంతరము తపోలోకాంచిత ఆజ్ఞా చక్రమును స్పృశించి, ఇట్లు ఈ షట్చక్రములలో సంచరించుచుండును. సాధకు డీ హంసను సప్తమ చక్రమగు సహస్రారమగు సత్య (బ్రహ్మ)లోకమును పొందును. ఇవియే సప్త చక్రములు. వీనినే సప్తలోకములన్నారు. ఇంత లోతుగా వేద మంత్రములను పరిశీలించి వాని అందలి విజ్ఞానాత్మకమైన విషయమేగాక తాత్త్విక జ్ఞాన రహస్యములను ప్రకటించుట మన ఆచార్యులకే తగును. ఇట్టి వీరి ప్రజ్ఞో పజ్ఞకు సాటిలేదనిన సత్యదూరము కాదు.

ఇవి వరకు తెల్పినట్లు శ్రీ దర్శనాచార్యుల వారే విషయము గాంచినను అందలి నిగూఢార్థమును వెలికిదీయుటయేగాక, దానిని తత్త్వదృష్టితోను, యోగదృష్టితోను, విశ్వసృట్ భావపరముగాను. శ్రుతిస్మృతుల ఆధారముతో సమన్వయము పరచుదురే కాని, పొల్లు భావములను ప్రకటింపరు. అందుకే నేటి వేదజ్ఞులెల్లరు వీరి మేధాశక్తి కచ్చెరువంది, వేదవాఙ్మయమునందత్యున్నత స్థానమగు "దర్శనాచార్య-కళాప్రపూర్ణా" ది బిరుద సన్మానములతో గౌరవించి ఆచార్యులనేగాక వేదభారతిని సత్కరించి నారనిన నతిశయోక్తికాదు.

ఇంతటిలో వీరి ఋగ్వేద రహస్యాలు సంక్షిప్తముగా ముగించి శ్రీవారి యజుర్వేద దర్శనము యొక్క సారామృతము చవిచూతము.

## యజుర్వేద దర్శనము

కళాప్రపూర్ణ దర్శనాచార్యులవారు తొలివేదముగా పరిగణింతబడిన ఋగ్వేదమును వివిధ దృక్కోణములనుండి దర్శించి, అందలి సారాంశవిశేషములను మూడు భాగములుగా మూడు గ్రంథములుగా మఱియు నందలి రహస్యములు "ఋగ్వేద రహస్యాలు"గా నొక గ్రంథమును విరచించినారు. వాటి నుండి కొన్ని ఘట్టములు మాత్రము ఈ రచయిత తనకు తోచిన పథముగ నాచార్యుల వారి ప్రజ్ఞా విశేషములను పైన వచించినాడు. ఇప్పుడాచార్యుల వారి యజుర్వేద దర్శనమును ఇంచుక చూతము.

కళాప్రపూర్ణులీ యజుర్వేద దర్శనమును యజుః ప్రశంసతో నారంభించినారు తదనంతరము శివపారమ్యమైన శతరుద్రీయము యొక్కయు, నమక చమకముల యొక్కయు నిగూఢార్థములను ఉపనిషత్ సమన్వయపూర్వకముగా విశదపరచి, విశ్వకర్మ సూక్తము

యొక్క అర్థ వివరణాది గాయత్రీ ప్రశంసయు, మరియు ననేక దేవతా మూర్తులను దర్శింప జేసినారు. సర్వము పరబ్రహ్మమే యను ఆధ్యాత్మిక భావముతో తమ దర్శిత భావమును సమన్వయ పరచి "ఏకం సత్" అను పేరుతో నీ యజుర్వేద దర్శనమును మంగళా శాసనయుక్తము పూర్తి చేసినారు. ఇక వీరి యజుః ప్రశంసను గూర్చి ఇంచుక తెలిసికొందము.

యజుర్వేద ప్రశంస :- లోకమున వేదములను పేర్కొను నపుడు సామాన్య జనము నుండి విద్వత్ప్రకాండుల వఱకు ఋగ్య జుస్సామాధర్వములని క్రమముగా జెప్పుట రూఢిలోనున్నది. ఈ క్రమముననే నాలుగు వేదములు బ్రహ్మదేవుని యొక్క పూర్వాది చతుర్దిశాననముల నుండి ప్రకటితములైనవని భాగవతాది పురాణ ములు కూడ వచించినవి. కాని వేదము లీ క్రమమునునెచ్చటను ముచ్చటించలేదు. ఆచార్యుల వారు ఋగ్వేద దశమమండల మందలి పురుష సూక్తమంత్రములలోని తొమ్మిదవ మంత్రమునుబట్టి వేద క్రమమిట్లున్నదని తెలిపినారు.

"తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచ,స్సామాని, జజ్ఞిరే
ఛందాగ్ంసి జజ్ఞిరేతస్మాత్ యజుస్తస్మాదజాయత"

దీసని బట్టి మొదటిది ఋగ్వేదము. రెండవది సామవేదము, మూడవది యజుర్వేదమనియు, అవికూడ పురాణోక్త బ్రహ్మముఖో ద్భవములు కావని, అవి యజ్ఞబ్రహ్మోద్భవములని వేదమే వచించు చున్నది. కృష్ణయజుర్వేదతైత్తిరీయోపనిషత్తు-శిక్షావల్లికూడ వ్యాహృతు లైన భూర్భువస్సువరః క్రమమును ఋక్,సామ, యజుర్వేదములుగా తెల్పినది. అంతియే కాదు యజుర్వేదము యజ్ఞపురుషుని "శీర్ష"ము, ఋక్సామములా పురుషుని దక్షిణోత్తరపార్శ్వములు, అధర్వవేద

మాతని వెను (పుచ్ఛ) భాగముగా బ్రహ్మానందవల్లి వర్ణించినది ఇట్టి యజుర్వేదము యొక్క ప్రాశస్త్యము నిదివరకెందఱకో తెలియని ఉపనిషద్వేదవాక్యముల ద్వారా మన దర్శనాచార్యులు దర్శించి యీ "యజుర్వేద దర్శనము"ను యజుః ప్రశంసతో శ్రీకారముచుట్టినారు. ఇది ఆచార్యుల యొక్క గంభీరతర రహస్య పరిశోధనా హృదయము దనుటకు తార్కాణము కాదా। ఇక ఇందలి శతరుద్రీయము యొక్క విశిష్టతను చూతము.

శతరుద్రీయము :- 'రుద్రీయ మను మాట రుద్రునకు సంబంధించిన విషయాదిక మంత్ర సంహితయని తదీయాఖ్యతచే తెలియు చున్నది. 'శత' పదము 'బహు' అను నర్థమున వేదమున ప్రయుక్త మైనదని వేదపండితులకు తెలియును. ఇందు రుద్రుడు బహుభంగుల స్తుతింపబడుట వలన నీ మంత్రము "శతరుద్రీయము"గా పేరు గాంచి నది. ఋగ్వేదమున రుద్రుడు అసతి మాత్ర మంత్రములతో 'లయ' కర్తగాను, 'కోపి'గాను వర్ణింపబడుట కాగా, యజుర్వేదము సర్వజ్ఞు డుగా, దేవాధి దేవుడుగా, విశ్వమునకు ఈశ్వరుగా స్తుతించినది. కాని శతరుద్రీయమను పేరు సార్థకమని దర్శనాచార్యులగారు సూక్తార్థ మంత్ర వివరణతో సమర్థించినారు.

ఇందొక మంత్రమున రుద్రుడు 'గిరిశంత' అని వాకొనిన భావమును భాష్యకారులు శివుడు కైలాసగిరి నుండి లోకములకు సుఖమునిచ్చు దేవుడని అర్థముచేయగా మన కొండూరు వారు యోగ దృష్టి కలవారగుటచే నీ 'గిరిశంత' పదమునకు ఆధారాదిషట్చక్రము లకు మీదనుండు సహస్రార శిఖరవాసియైన పరబ్రహ్మ పరమేశ్వరు డుగా నర్థము గ్రహింపవలెననియు, ఆ సహస్రారవాసియైన శివుడే - మానవునకు సుఖములు నొసగువాడని ప్రకటించినారు. యోగి సహ స్రార శిఖర స్థానము నందిననేకాని, సుఖానందములు పొంద లేడని

ఆచార్యుల ఉద్దేశము. ఆధ్యాత్మికముగా నీ అర్థమును గ్రహించుటయే సర్వసమ్మతమనుటకు సందియములేదు.

మరొకమంత్రమున రుద్రుడు "సవిత"గా అనగా సూర్యుడుగా స్తుతింపబడినాడు. సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడని, విశ్వకర్మ రూపుడని ఋగ్వేదము నుండి తెలిసిన విషయమే. ఐనను సకల దేవతా మూర్తి యగుట వలన కేవలము - సవిత - అనగా భానుమంతుడనుట సరియైన అర్థముగా తోచదు. "సవిత" యనగా (ఇదివరకటి దిగ్దర్శనములలో) జనకుడని తెలిసికొన్న అర్థమునే ఇట గ్రహించి రుద్రుడు విశ్వజనకుడని స్వీకరించుట కేలాటి విప్రతిపత్తి యుండనేరదని ద్రష్టగారి యభిప్రాయము.

ఇట్లెన్నియోవిధంగుల స్తుతింపబడిన శతరుద్రీయ మంత్రములలో ప్రయుక్తమైన పదజాలమునకు వివరణార్థ విశేషములు తెలిపి రుద్రుదేవునకు, విశ్వకర్మ దేవునకు-నిరువురును పంచానన, త్రినేత్రులగుటంజేసి — సముచితాభిన్నత్వమును నిరూపించినారాచార్యవర్యులు

నమకచమకములు :- శతరుద్రీయ భావానుసారము శివుడు (రుద్రుడు) అనేక నామములతో స్తుతింప బడినాడనుట నిర్వివాదము. అట్టి స్తోత్రము యొక్క ప్రతి నామమునకు చివర "నమః" అని వచ్చుటచేత, స్తోత్రము మొత్తము ఆదినుండి ఆద్యంతము వరకు నమస్కారయుక్తమైనది. దానిని "నమక"మని అన్నారు. అదే విధముగ రుద్రుని (శివుని) ప్రతి నామము ద్వారా స్తోత్ర పాఠకుడు, తనకేదో యొకటి కావలెనని అర్థించు నర్థమున "చమే" యనునది ప్రతి నామమున నాకు, నా గురించి, అని అర్థింపబడెడు ప్రార్థనతో కూడినదై

యుండుట వలన "చమక" మని ప్రసిద్ధమైనది. కావున నమకము నమస్కార పూర్వకము. చమకము ప్రార్థనాయుక్తస్తోత్రము.

ఈ నమకములు కృష్ణయజుస్సంహితలో నాలుగవ కాండమున నైదవ ప్రపాఠకమున పదునొకం డనువాకములుగా గలవు. రుద్రుడు ఏకాదశ స్వరూపుడని (ఏకాదశరుద్రులని) చెప్పబడుటచే నీ అనువాకము లాసంఖ్య యొక్క ప్రాధాన్యతను తెలుపుచున్నవి. దాదాపు నూటికి పైగల యీ నామక స్తోత్రముల నాచార్యుల వారు దర్శనము'న నొక్కొక్క నమకమును వ్యాఖ్యానించి రుద్రుడు విశ్వేశ్వరుడని, సర్వేశ్వరుడని వివరించి రుద్ర-విశ్వకర్మల క భేదము ధృవపరచినారు. క్లుప్తముగా నిట నమకమును గురించి తెలుపనైనది.

ఈ ప్రకారముగానే తైత్తరీయ సంహిత చతుర్థకాండములోని 7వ ప్రశ్నమున (11) అనువాకములందలి ఏ చమక మంత్రములు పఠించుచు, మనము రుద్రాభిషేకము చేయుదుమో, వాటి నన్నింటిని నుటంకించి అర్థ వివరములు కూడ తెలిపినారు. ఉదా :- పదనొకండవ అనువాకమున-ఎకాచమే-త్రిస్రశ్చమే-పంచచమే ఇత్యాది మంత్రముల నిట్లు వివరించినారు. ఈ సంఖ్యావాచక పదము లొక్కొక్కటి ఒక్కొక్క అర్థమునకు సంకేతమని-ఏక సంఖ్య విశ్వకారణ పరమాత్మకు అనగా "ఏకమేవాద్వితీయ" అనుటకు సూచనగాను, "త్రి" పదము త్రిగుణములుగాను, త్రిమూర్తులుగాను, పంచసంఖ్య పంచభూత పంచేంద్రియ పంచబ్రహ్మలుగాను వేదము సూచించుచున్నదర్థమని వచించినారు. ఏకాదశ సంఖ్య ఏకాదశ రుద్రులనుటయేగాక ఏకాదశేంద్రియములకు (దశేంద్రియములు + ఆత్మకు) సంకేతముగా నుడివినారు. 'భువనశ్చాధి పతిశ్చ' అన్న చమక్యాంత పదము, రుద్రుడు భువనములకధిపతియని వర్ణింపబడుటచే భువన కర్తయే భువనాధిపతికదా!

ఈ భువనాధిపతి భువనకర్తయైన విశ్వకర్మయని ఇదివరకే పూర్వ దర్శనములందు తెలిసి యున్నాము. కాన విశ్వకర్మయే రుద్రుడు, రుద్రుడే విశ్వకర్మయని ఆచార్యులు సమన్వయపరచి విశ్వకర్మాద్వైతమును స్థిరపరచినారు. ఇందు కాధారము నమకచమక రహస్యమున చూడగలము.

నమక రహస్యము :- నమకమును శివదేవ పరమైన పరమార్థ తత్త్వబోధక మంత్రమనవచ్చును. ఋగ్వేద వర్ణిత విశ్వకర్మ సూక్తమున విశ్వకర్మను గూర్చి "విశ్వతః చక్షురుత విశ్వతోముఖ" ఇత్యాది స్తోత్రభావమును, పురుష సూక్తవర్ణిత "సహస్రశీర్షం దేవం" ఇత్యాది ఇంద్రోపేంద్రసూర్యాది సకల దేవ భావమును, ఈ యజుర్వేద శతరుద్రీయ నమకమంత్రములందు వర్ణింపబడిన రుద్రుడే సకల దేవతారూపుడుగా తెలిసికొన్నాము. అనగా సర్వేశ్వరుడగు పురుషుడు లేదా విశ్వకర్మ లేదా ఆత్మయను వాడు ఒకడే కాని భిన్నులు కాదని శ్వేతాశ్వతరోపనిషత్తు "ఏషదేవో విశ్వకర్మామహాత్మా సదాజనానాం హృదయే సన్నివిష్టః" అని సమర్థించినది. హృదయసన్నివిష్టుడైన పురుషుడే సర్వేశ్వరుడని తెలియవలయును. ఆ హృదయసన్నివిష్టుడే ఈ నమకములందు నమస్కరింపబడినాడని మన దర్శనాచార్యుల దర్శిత రహస్యము.

చమక రహస్యము:- చమకమంత్రములోని అంతరార్థమేమిటని, మన కళాప్రపూర్ణులందలి ఒక్కొక్క మంత్రమును లౌకికార్థమును, ఆధ్యాత్మికార్థమును పరిశీలించి ఇట్లు వివరించినారు. బాలుడు తన కేమికావలెనో, వాడెట్లెదుగవలెనో, ఆకలిదప్పులెట్లు తీర్చుకొనవలెనో యెరుగడు. కాన వాని తల్లి వాని ముందు నానారుచుల వివిధ పదార్థములుంచి వాటిలో వాడే వస్తువునధికముగా తినితుష్టి నొందునో కనిపెట్టి వాని కిష్టమైనదియే యొసగి ఆ కుమారుని అభివృద్ధి, అభిరుచులకు

దోహదము చేయును. ఇది ప్రతి తల్లి యెరిగిన విషయమే. అటులే మనుజకోటి కూడ చిన్నిబాలురవంటి వారగుటచే, వారికెంత లోక జ్ఞానమున్నను పూర్ణవిజ్ఞత కల వారుగా భావింపవలనుపడదు. కాన వారి అభివృద్ధికై వేదమాత ఈ చమకములలో ప్రకృతి జన్య వస్తు సముదాయమును అనగా వైదిక - లౌకిక పరిజ్ఞాన విషయములనెల్ల అందించినది వాటిలో "హేఃకుమారులారా! మీ మీ అభిరుచుల ననుస రించి, మీకేది కావలయునో నదియే పరిగ్రహించి మీరు శ్రేయంబు నొందుడు. ఉన్నతోత్తమ మానవత్వమును సముపార్జించుకొను"డని తెలియపరచుటకే 'చ - మె' యను స్తోత్రముల ద్వారా సూచించిన దని గమనింపసగును. జగద్వస్తు సముదాయములో "మీకవసరమైనది మీ అభిరుచికి తగినది మాత్రమే గ్రహించి ఇతరులదైన దెద్దియు నాకాంక్షింపవల"దని ఈశావాస్యోప నిషన్మంత్రము - "మాగృధః కస్యస్విద్ధనం" అని చమక భావమును సమర్థించుచున్న అర్థముతో నాచార్యుల వారు సమన్వయపరచి తమ భావమును ప్రకటించి ను తేజపరచినారనుటలో సందియము లేదు.

పంచ సంఖ్యాతత్త్వము :- వేదములందు విశ్వకర్మ సూక్త- పురుష సూక్తములు వర్ణించిన విశ్వసృష్టి క్రమము, పరమాత్మ నుండి ఆకాశాది పంచ భూతములు కల్గినవని, ఆ పంచ భూతములవలననే ఈ సృష్టి కలిగి విస్తరించినదని తైత్తరీయోపనిషత్తు చెప్పినది. ఆకాశాది పంచతత్త్వముల వలన పంచగుణములనబడు శబ్ద స్పర్శ రూప రస గంధములు, త్వక్ శ్రోత్రచక్షుఘ్రాణ జిహ్వాములనబడు జ్ఞానేంద్రియ పంచకము, వాక్పాణి పాదపాయురోపస్థలగు కర్మేం ద్రియ పంచకము కల్గినట్లు శ్రుత్యుపనిషత్తులు తెల్పుచున్నవి. ఇట్లు పంచసంఖ్యాక సకల కర్మలుగలిగి ప్రపంచమైనదని తెలియును. మానవుడనుభవించు జాగ్రత్స్వప్న సుషుప్తి, సమాధి, తురీయమను

పంచదశలను, సత్-చిత్-ఆనంద-నామ-రూపములనెడి పంచాంశములను, పంచాధికరణములను, పంచ ఉషస్సులను, పంచ దోహాలు మరియు పంచఋతువులగు పుష్పవతి (వసంత), తాపవతి (గ్రీష్మ), వృష్టివతి (వర్ష), జల ప్రసాదవతి (శరత్తు), శైత్యవతి (హేమంత శిశిరములు) మున్నగు ప్రకృతి సంబంధ కాలమానములు కల్గినవని వేద సాక్ష్యముల ద్వారా పంచసంఖ్యా విశిష్టతను వివరించినారు.

ఇందియేకాదు పంచభూత తత్త్వమును ఆమోదింపక, కేవలము నాలుగు భూతములనే జగత్తేర్పడినదను బౌద్ధమతాచార్యులు కూడ రూప-వేదన-సంజ్ఞ-సంస్కార-విజ్ఞానములనెడి పంచ స్కంధములను ఆత్మస్థానమున నిర్వచించి, లోకకల్యాణమునకై అహింస-సత్యము-మధుపాన వర్జనము-పరస్త్రీపరిగ్రహణము-పరధన కాంతా విముఖత యను పంచ శీలములను ప్రచారము చేసినారు. ఇట్లు పంచ తత్త్వ ప్రణాళికయే సృష్టి నిర్మాణమునకు మూలమనుటలో సందేహము లేదని ఆచార్యుల అభిభాషణ.

కాన పంచ భూతములు, పంచవిధకృత్యము లొనరించుననుటకు ఆధ్యాత్మిక దృష్టితోకూడ సముచితమే. ఈ పంచకృత్య-పంచ భూతముల కధిపతులు పంచబ్రహ్మలు. పంచమూర్తులు, పంచఋషులు శ్రుతులందు మనకు కనబడుదురు. వారెవరన బ్రహ్మ (త్వష్ట) సృష్టికి, విష్ణుడు పాలనకు, రుద్రుడు లయమునకు, ఇంద్రుడు తిరోధానమునకు, సూర్యుడు అనుగ్రహమునకు పంచమూర్తులుగాను, మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులు పంచ బ్రహ్మలుగాను, సానగాది సుపర్ణ పంచకము పంచఋషులుగాను తెలియనగును. పంచతత్త్వ ప్రాముఖ్యతను మన మనుడనము చూచుకొనెడి పంచాంగమే గాక మన కరచరణాదులకు గల ఐదేసి వ్రేళ్ళు తెల్పుచున్నవి.

పంచసంఖ్య యొక్క ప్రాముఖ్యమిట్టిది కనుకనే జగత్తును ప్రపంచ మన్నారు.

## "గాయత్రి"

ఇక దర్శనకర్తగారి "గాయత్రి"ని గూర్చి వారి ప్రభావమును తెలిసికొందము. గాయత్రి యను పదమునకు "గానము చేయ వారిని రక్షించునది" యను నర్థము తెల్పి, ఋగ్వేదములోని (6–61–4) ప్రణో'దేవీ సరస్వతీ, వాజేభి ర్వాజనీవతీ, ధీనా మవిత్ర్యవతు" మంత్రము నుదహరించి తనను ధ్యానించు వారిని రక్షించునదియు, జ్ఞానము అను అన్నదానము చేయు సరస్వతి మమ్ము రక్షించుచు మా బుద్ధులను (ధినాం అవిత్రీ) రక్షించి ప్రేరేపించుగాక యని ఆచార్యులు గాయత్రికి అర్థము విశదపరచినారు.

గాయత్రి మాతకు పై మంత్రమున తెల్పినట్లు 'సరస్వతి యనియు మరియు సావిత్రియనియు నామాంతరములు కలవు. ఈనామముల చేతనే ఉదయము మధ్యాహ్న సంధ్యాకాలములందు అనుదినము మూడు సంధ్యలందారాధింతుము. గాయత్రీదేవిని ప్రకృతిగాకూడ మన మిదివరకే తెలిసికొన్నాము. అట్టి గాయత్రిని ధ్యానించుట, యనగా గాయత్రీమంత్రమును జపించుటయగును. అంతకంటేమించిన అర్థము ఆధ్యాత్మికముగాను, యౌగికముగాను కలదు. యోగులు తమ హృదయ గహ్వరమున నిరంతరముసంచరించు 'హంస'ను ఆధారాది చక్రముల ద్వారా లేపుచు సహస్రారమున నిలుపుదురు. ఇదియే కుండలినీ యోగము. దీనినే ప్రాణాయామ మందురు. ఈ 'హంస'ను గాయత్రి యని తాత్త్వికార్థమున భావింతురు. గాయత్రి అనబడు నీ హంస, యోగముచే ప్రాణిని (మనుజుని) దీర్ఘకాలము రక్షించు ననుట సత్యదూరముకాదు. కాన గాయత్రి (హంసను) త్రాయతే-రక్షించునది యని అర్థము.

యజుర్వేదమున గాయత్రీదేవిని "హేవిశ్వకర్మన్నితి దేవానా మాహ్వానం, దాభిశ్వసురాణామాహ్వానం, విశ్వాని కర్మాణి యస్యసా విశ్వకర్మా" అని వచింపబడిన మంత్రములోని విశ్వకర్మ పదమునకు సాయణాచార్యులు విశ్వకర్మ సూక్తములో విశ్వకర్మపద అర్థము ననుసరించి "విశ్వవిషయాణి సృష్టి స్థితి సంహార రూపాణి యస్యాసౌ విశ్వకర్మా" యను భాష్యవివరణచే గాయత్రీ విశ్వకర్మల కభేదము సూచింపబడినది. సకల కర్మ కలాపము లాచరించునది ప్రకృతియే కదా! ఆ ప్రకృతియే పురుషుని యొక్క ప్రతిబింబము. "ప్రకృతి" సర్వకర్మ నిర్వహణకారిణి కాగా "పురుష" డా ప్రకృతి చేత సమస్తము నిర్వహింప జేయును. గాయత్రీదేవి విశ్వకర్మయొక్క ప్రతీకగా సాయణాచార్యుల భాష్యార్థము. కావుననే ఉదాహృతపై మంత్రమున దేవతలు-అసురులు పోరాడుచు తమ విజయమునకై యొకప్పుడు గాయత్రీదేవిని విశ్వకర్మగా దేవతలు ధ్యానించి తమ ఓజోబలోత్సాహ శక్తిపొంది విజయులైరి అని వేదోక్తగాధనుటంకించి వీర రాఘవాచార్యులు గాయత్రీ విశ్వకర్మల అభిన్నత్వమును దృఢ పరచినారు. కాన గాయత్రి నారాధించినను, విశ్వకర్మనారాధించినను ఒకటేయని గాయత్రీ విశ్వకర్మాద్వైతమును సిద్ధిపరచినారు. ఇపుడు గాయత్రీ యననేమియో క్లుప్తముగా తెలిసితిమి.

ఈ ప్రకారముగ మన కళాప్రపూర్ణ దర్శనాచార్యులు తమ యజుర్వేద దర్శనమున ననేకానేక మంత్ర సూక్తముల అంతరార్థము లను వెలికితీసి లోకమునకు దేవాధి నాథుడైన విశ్వస్రష్టయే "ఏకం సత్'-"సర్వంఖల్విదం బ్రహ్మ" యని శ్రుతి వచన విషయమును తమ "ఏకం సత్ నామక యజుర్వేద ప్రథమ భాగమున విశద పరచినారు.

శ్రీవారి పరిశోధిత సర్వస్వములో కొన్ని విషయములను మాత్రమే యిందు చూపనైనది. ఇది యజుర్వేద ప్రథమ దర్శన సారాంశము.

## ఉపసంహారము

ఆచార్యులు గారి విద్యార్థిదశగాని, ఉద్యోగదశగాని గృహస్థాశ్రమ జీవితముగాని, గ్రంథరచనగాని ఎన్నెన్నో ఆదర్శాలకు నెలవైనటువంటిది. వారి భార్యావియోగానంతరపు ఆధ్యాత్మిక జీవితమింక అనేకాదర్శాలకు నిలయమైనది. వారు సన్న్యాసివలెను, అవధూతవలెను జీవించుచు బాహ్య వేషభాషాచారాలకు లోనుకాలేదనవచ్చును, అట్టి వారగుటచే కాబోలు—

"వేషమెన్న వెలిది విజ్ఞతలోనిది
జ్ఞానమొకటె మోక్షసాధనంబు
వట్టి వేషమూని వంచింపకు జగంబు
విశ్వహిత చరిత్ర విసర మిత్ర!"
యని తమ హృదయ భావమును ప్రకటించినారు.

ఇట్టి వారి జీవిత చరిత్రను రచింప బూననైనందున వారి జీవితములోని సంఘటనా సన్నివేశములతో పాటు సాహిత్యారాధనా వాఙ్మయ జీవిత ఘట్టములు కూడ ఇందు చూపిననేగాని, చరిత్రయనిపించుకొనదిని, కొన్ని రచనల గురించి మాత్రమే తెలుపనైనది కొన్నింటిని పేర్కొననైనది. వీరు తమ ఋగ్యజుర్వేద దిగ్దర్శనాదులు రచించుటకు పూర్వము శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతము, అమరావతి యను కావ్యము, లేపాక్షి నామక నవల రచించినారు. విశ్వకర్మ జగద్గురు శ్రీశ్రీశ్రీ కాళహస్త్యాచార్యప్రణీత (సంస్కృత) విశ్వకర్మ పురాణమునకు శ్లోకానువాదాంధ్రతాత్పర్యము వ్రాసి, ప్రచురించి, తమ

నిరంతర భాషామతల్లి సేవానిరతిని ప్రదర్శించి, ఇప్పటికెనుబదేండ్ల పరిపక్వధీశక్తిచే నింకను సరస్వతీ సేవచేయుచునే యున్నారనుట ముమ్మాటికి సత్యమని వక్కాణింతును.

ఇందలి ఆరంభ పుటలలో తెలపబడినట్లే కళాప్రపూర్ణులు తమ దాంపత్యమును ప్రకృతి - పురుషులవలె సాగించుచు నవవిధ ప్రేమోదయముల(*1) వంటి తొమ్మండుగురకు పితృపాదులైనారు. జ్యేష్ఠాదిక్రమమున పార్వతమ్మ, త్రిపురసుందరీదేవి, సుమతీదేవి, ఉభయభారతి, ఆనందవర్ధనుడు, శ్రీదేవి, వసుంధర, స్వారాజ్యలక్ష్మి మరియు శాంతల యనువారలు, పార్వతమ్మగారు రామబ్రహ్మం గారి అర్ధాంగియై వెలసినది. త్రిపురసుందరీదేవి సంగీత, కళలతో నాప్పారి సత్యనారాయణ గారికి ధర్మపత్నియైనది. వేంకటేశ్వరరావు గారిని ఉభయభారతి చేపట్టినది. ఇక శ్రీదేవి దాదాపు 30 గ్రంథములు రచించిన ప్రాజ్ఞ ఈయమ నాగబ్రహ్మం గారి వామాంగశ్రీయైనది. ఆలవపుత్రి వసుంధరాదేవి ఆంధ్ర సంస్కృతాంగ్ల హిందీ భాషలలో విజ్ఞతనార్జించి సుందరయ్య గారి వలన నొక కూతురును గని కనుమూసినదట. ఈ వసుంధరాదేవికి ఆచార్యుల వారు తమ 'మిత్ర సాహస్రి"లోని ద్వితీయ శతకమును చిరస్మరణీయముగా నంకిత మిచ్చినారు. స్వారాజ్యలక్ష్మిని వల్లభాపురపు జెజిబాబుగారితో వివాహము చేసినారు. తరువాతి పుత్రిక శాంతలాదేవి.

---

(*1) నవవిధప్రేమోదయావస్థలు—1. శ్రద్ధ, 2. సాధుసంగము,
3. భజనక్రియ, 4. అనర్థనివృత్తి, 5. నిష్ఠ, 6. రుచి,
7. ఆసక్తి, 8. భావము, 9. ప్రేమ.

## సతీవియోగము

ఇందరకు పితృపాదులైన మన శ్రీ రాఘవాచార్యుల అర్ధాంగ లక్ష్మి శ్రీ రాజేశ్వరమ్మ దుందుభినామ సం॥ శ్రావణ శుక్ల (ల) అష్టమి బుధవారము (28-7-1982)న విశ్వకర్మసాయుజ్యమందినది. ఆయమ శ్రీ బాలాత్రిపుర సుందరీదేవి ఉపాసకురాలు. ఆయమ నిర్యాణము మన ఆచార్యుల వారికెంతో లోటుకల్గించినది. కాని ఒక మేలు కూడ కల్గించినదని ఆచార్యులు భావించినారట. తామెంతోకాలము నుండి ఎదురు చూచుచున్న సన్యాసాశ్రమమును కిది మేలుచేసినదైనదని భావించినారట. సన్యాసము గొనకున్నను గృహస్థుగా నుండియు ఆయమ వియోగము వల్ల అది పూర్తిసిద్ధైనదని దర్శనాచార్యుల ఉవాచయ సినదైనది. ఆకారణమునసనే రాఘవచార్యులు నాటినుండి ప్రశాంతనందులైనారు. తమ గోత్రర్షినామముతో వెలసినారు, హృదయ సన్యాసమే సన్యాసాశ్రమమగునని వారి భావము. కావుననే-

> "కావి గట్టకున్న కావచ్చుసన్యాసి ।
> తలపు లెదదనుండి తొలగెనేని
> తలను గొరగకున్న తా పరబ్రహ్మమే ।
> అద్వయంబుజ్ఞాన మమరుమిత్ర

అని మిత్ర సాహస్రిలో వ్రాసినారు.

వంశవర్ధనుడగు ఏకైక పుత్రుడు ఆనందవర్ధనాచార్యుడు. వీరికి విజయలక్ష్మి యను సాధ్వితోనుద్వాహ మొనర్చి దర్శనాచార్యులు స్నుషగా స్వీకరించినారనిన నా యమయెంత సద్గుణ సంపన్నయో యూహింపుడు. ఆనందవర్ధనాచార్యుడు శిరిడీసాయిస్వామిభక్తుడుకూడ.

## " శుభాశంసనము "

ఇది మహామనీషియైన బ్రహ్మశ్రీ డా॥ కొండూరు వీర రాఘవా చార్యులు (M.A Ph D.) గారి సంక్షిప్త జీవిత కథాంశము. జీవిత కథ కంటే శ్రీ వారి వేద విజ్ఞాన సారస్వత సంక్షిప్త చరిత్రమని యన వచ్చును ఇట్టి మహామహుని చరిత్రము వ్రాయ సంక్షిప్తమే యైనను - ప్రోత్సాహితుడైన ఈ రచయిత, ఆచార్యుల వారి మైత్రీ భావము నాదరించి, అభిమానించి సూర్యుని ముందు కర దీపిక వంటి ఈ కృతి నొనరించి సుకృతి యైనాడని భావించుచున్నాడు.

కళాప్రపూర్ణ శ్రీకొండూరు వారి వంశ మాచంద్రార్కకముగా, అవిచ్ఛిన్న విజ్ఞానసౌరభ ప్రసారమై యశోధనకీర్త్యానంద సుఖప్రపూర్ణమై వెలయ శ్రీ విరాడ్విశ్వకర్మ గాయత్రీ సమేతుడై సర్వదాగాంచు చుండుగాతయని రచయిత ఈ కృతిని పరిసమాప్తి చేయుచున్నాడు. *

సర్వేజనాస్సుఖినోభవంతు
ఇతి శమ్



# విరచిత ఇతర గ్రంథములు

## :- ముద్రితములు :-

1 శ్రీ [illegible]లుకూరు వేంకటేశ్వర మహాత్మ్య (పద్యకావ్యము)
2 నిరోష్ఠ్య శంకరస్తుతి (శతకము) (పద్యము)
3 శ్రీ రాట్ వీరబ్రహ్మ చరిత్రము (పద్య కావ్యము)
4 శ్రీ తింథిణీ మౌనేశ్వర శతకము (పద్యము)
5. శ్రీ తింథిణీ మౌనేశ్వర సందేశము (అనువాదము)
6. శ్రీ మౌనేశ్వర సుప్రభాతము
7. "గాయత్రి" యననేమి ? (గద్యము)
8. శ్రీ శిరిసంగి (శృంగి) కాళికా సుప్రభాతము
9. మన శ్రీ మఠము (సరస్వతీ పీఠ గురు పరంపర) (గద్యము)
10. కవిసింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్ర (పద్యము)
11. శ్రీ మదనుమదనగిరి అచలఋషి గురుపరంపర (పద్యము)
12. త్రిపురనేని సుబ్బారావు జీవిత చరిత్ర (పద్యము)

## :- అముద్రితములు :-

13. శ్రీ అనంత పద్మనాభ చరిత్రము (పద్యము)
14. కాకతీయ మహాశిల్పి (కావ్యము)
15. విశ్వకర్మ-ఆయన సంతతి (అనువాదము) (గద్యము)
16 శ్రీ మదానెగొంది ఏకదండిగురునాథస్వామి విజయము (చరిత్ర) (గద్యము)
17 శ్రీ విశ్వకర్మ పురాణము (కావ్యము)

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 2 | 5 | సువర్ణ | సుపర్ణ |
| 4 | .0 | సదెం | నందెం |
|  | 22 | నెలయుట | వెలయుట |
| 5 | 13 | ధైర్యములో | ధైర్యముతో |
|  | 14 | గురువునై | గురువునునై |
|  | 16 | మదళమై | మరాళమై |
|  | 19 | తన | తమ |
| 8 | 15 | విష్ణుచిత్తా | విష్ణుచిత్తీ |
| 10 | 6 | చిత్తోత్త్రోప్రరణ | చిత్తోత్ప్రేరణ |
| 12 | 16 | వనితంసుడీ | వతంసుడీ |
|  | 18 | అనర్ఘరాష | అనర్ఘరాఘ |
| 13 | 12 | తెలిసికొని | తెలిపికొని |
| 14 | 2 | విద్యార్జని | విద్యార్జన |
| 15 | 24 | జాన | జ్ఞాన |
|  | 24 | వృది | వృద్ధి |
| 16 | 21 | గాంచుచుండిను | గాంచుచుండియును |
| 19 | 20 | అయ్యె | అయ్యై |
| 20 | 24 | పాచ్యవిద్యా | ప్రాచ్యవిద్యా |
| 23 | 7 | పోషణాదుబేలంద | పోషణాదులంద |
|  | 18 | యాంతరర్త్రి | యాంతర్వర్తి |
|  | 23 | విజత | విజ్ఞత |
|  |  | క్షాకర్షితులై | కాకర్షితులై |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 23 | 23 | సభాపతిత | సభాపతిత్వ |
| 30 | 2 | ఆకాడమియొ క్క | ఆకాడమియొక్క |
| 32 | 10 | సాంఘీయులు | సంఘీయులు |
| | 14 | కొందాము | కొందము |
| | 20 | నలదారిన | నలరారిన |
| | 21 | సూత్న | నూత్న |
| 36 | 11 | ఏతంసత్ | ఏకంసత్ |
| | 24 | శి ప | శిల్ప |
| 39 | 10 | విరాడీశ్వర | విరాడ్వీర |
| 40 | 1 | జరిగిన | కరిగిన |
| 42 | 16 | తమమన | తమమున |
| | | సత్-ఆసత్ | సత్-అసత్ |
| 43 | 4 | ఆనువా | అనువాని |
| 44 | 1 | నియమాపన | నియమాసన |
| | 6 | శీర్షి లో | శీర్షికలో |
| 46 | 3 | గణావగుణము | గుణావగుణము |
| | 15 | యెన సహస్ర | ౖయెన సహస్ర |
| 50 | 14 | ఇంతక ముందు | ఇంతకు ముందు |
| | 17 | తెలపంబడినది | తెలుపంబడినది |
| 51 | 1 | రెండ | రెండవ |
| | 7 | వర్ణిపబడినవి | వర్ణింపబడినవి |
| | 22 | వంశము ందలి | వంశము నందలి |
| 52 | 18 | కర్తగారి భిమతము | కర్తగారి అభిమతము |
| 54 | 3 | మొర్పులేదు | మొనర్పలేదు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 54 | 4 | శే శా యెన | శేషశాయియైన |
| | 18 | పంచభూతమయు | పంచభూపమయ |
| 58 | 17 | ఆకాశ సౌదము | ఆకాశసౌధము |
| 63 | 10 | విద్యుద్రపకాండులగు | విద్వుద్రపకాండులగు |
| 68 | 6 | నుంచుక | నించుక |
| 69 | 20 | వితర్కరించి | వితర్కించి |
| 72 | 3 | యను | మను |
| | 13 | కాలమునొక | కాలముననొక |
| 79 | 15 | భూవర్లోక | భువర్లోక |
| 80 | 9 | ఇంతటిలో | ఇంతటితో |
| | 12 | పరిగణింత | పరిగణింప |
| 81 | 16 | హతః | హుతః |
| 82 | 9 | తదీయాఖ్యతచే | తదీయాఖ్యచే |
| 83 | 8 | జకుడని | జనకుడని |
| 84 | 7 | నామక | నమక |
| | 23 | పలిశ్చ | పతిశ్చ |
| | | క్యాంత | కాంత్య |
| 87 | 7 | ఇంతియేకాదు | ఇంతియేకాదు |
| | 11 | పస్త్వపరి | వస్త్వపరి |
| 89 | 1 | విశ్వకర్మనిర్మితి | విశ్వకర్మన్నితి |
| | 2 | దాభిత్వసురా | దాభీత్యసురా |

# విరాళ ప్రదాన్యులు :

1. బ్రహ్మశ్రీ అరవిందాచార్యులు (మను) గారు రూ॥ 2125/-
2. „ రవీంద్రాచార్యులు (మను) గారు రూ॥ 1116/-
3. „ పసునూరి బ్రహ్మానందాచార్యులు గారు రూ॥ 1116/-
4. „ చింతలపాటి నాగభూషణం గారు రూ॥ 1116/-
5. „ టి. రామయ్య గారు రూ॥ 301/-
6. „ వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి గారు రూ॥ 116/-

కేవలమొక యాంత్రిక దృష్టితో మాత్రము చూడరని నుదాహృత విషయ వివరణ ద్వార తెలిసికొనగలము దర్శిత వస్తువులందు శిల్ప రహస్యములను, శిల్ప సృజనా నైపుణ్యములను, ఆయా దేవతాలక్షణములను లౌకిక పరముగాను, ఆధ్యాత్మికపరము గాను విలోకించి లోకమున కవ్వాని ప్రయోజనములను వెలువరింతురు. అట్టి విషయ వివేచనతో నిండినదే యీ వ్యాస సంపుటి.

ఈ సంపుటిలో స్థాపత్యకళను గూర్చియు, వేదకాలమునందలి శిల్పులను గూర్చియు, శిల్పశాస్త్రాగమ ప్రాధాన్యతను గూర్చియు క్షుణ్ణముగా వివరించినారు. వీరి వ్యాసావళియే కాదు వీరి కృతులలో నేది చదివినను వీరి సారస్వత లక్ష్యమేగాక వీరి హృదయము మనకు గోచరమగునని నొక్కి వక్కాణింపగలము.

## పెనుగొండ

పెనుగొండ పేరు వినని ఆంధ్రుడుండడనిన నాశ్చర్యము కాదు ఈ పెనుగొండ ఆలనాటి తన శిల్ప వైశిష్ట్యమును నేటి అవశేషములద్వార ప్రకటించుచున్నది. ఇది కృష్ణరాయల వారికి వేసవి కాలపు విడిదిగా నుండెడిదని చారిత్రికులందురు. రాయల వారిచట నివసించెడి ప్రదేశమును "గగనమహల్" (ఆకాశ సౌధము) అని చెప్పుదురు. అత్యున్నత స్థానమున నత్యున్నతముగా నుండుటచే దాని కాపేరు కల్గియుండునని రాఘవాచార్యుల తలంపు.

పెనుగొండ రాయలవారి వేసవికాలపు విశ్రాంతి గృహమేగాక మరొక అనుపమాన విశేషముకూడ కలదు. ఆనాడచటికేగిన వ్యక్తి నిత్యమొక దేవాలయమును, సంవత్సరము పొడుగున దర్శింపగల్గెడివాడట. అనగా నచట మున్నూటరువది దేవాలయములుండెడి

వని జనశ్రుతి. వాటిలో మన కిప్పుడు కనుల నలరించునవి రెండే రెండు ఆలయములు దర్శన మిచ్చును. ఒకటి "యోగరామస్వామి" ఆలయము, రెండవది "కాశీశ్వరాలయము".

యోగ రామేశ్వరాలయము : యోగరామస్వామి ఆలయము యొక్క గోపురమునందడుగిడగనే ఇరు పార్శ్వములలో సిరపురు దేవతలు ఉన్నతాకారమున దర్శన మిత్తురని వీరరాఘవాచార్యుల ఉవాచ. అచటి ఎత్తైన ధ్వజ స్తంభ మొకే యొక శిలా నిర్మితము అది శిల్పకళా శోభితమైనది. ఆ ధ్వజస్తంభముపైన నొక విచిత్ర శిల్పము మూడు తలలతో చెక్కబడి యుండుట కాంచెదము. ఈ శిల్పములు అజంతా ఎల్లోరా శిల్ప నిర్మాణ కాలమునుండి ఆంధ్ర దేశమున శిల్పింపబడుచుండినట్లు మన మూహింపగల్గు నవకాశ మీ స్తంభ విగ్రహము కల్పించుచున్న దనవచ్చును. ఈ యోగరామ స్వామి ఆలయపు గోడలమీద ననేక భంగిమలలో శ్రీకృష్ణ లీలలు, అయా సన్నివేశములను తెల్పునవి చెక్కబడియున్నవి. ఆలయము యొక్క మూల విరాట్టైన యోగ రామస్వామికి దక్షిణ భాగమున లక్ష్మణమూర్తి, వామ భాగమున సీతామహాదేవి, ముందు పార్శ్వమున ఆంజనేయమూర్తి ప్రతిష్ఠితులై శోభ లొల్కించుచున్నారని దర్శించి వచించుచున్నారాచార్యులు.

కాశీశ్వరాలయము :- ఇది యోగ రామేశ్వరాలయమునకు నికటమున గలదు. ఈ ఆలయ కుడ్యములమీద శివగాథామయ శిల్పము లత్యంత సుందరముగా మనోజ్ఞముగా చెక్కబడినవి కలవు. విఘ్నేశ్వరాది శైవ దేవతా శిల్పములు, మరియు శివభక్తుడగు భిల్లనాథుని విగ్రహము కనుపండు వొనర్చును. శివాలయమగుటచే శివతాండవాది నృత్య శిల్పములుండుట సహజము, సముచితము.

బొందుటకు, యమ, నియ, మాసం ప్రాణాయామ, ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధులనెడి అష్టాంగ యోగము లాచరించుచు, తద్వార సాంఖ్య, తార కామనస్క పరిపూర్ణత కలిగి జీవుడు బ్రహ్మానందామృతము నందును అనుభవే యోగము యొక్క ప్రయోజనమని దర్శనాచార్యుల దర్శన సారాంశము.

తరువాత శీర్షికలో నాచార్యులు, సాంఖ్య సిద్ధాంతమును, చతుర్వింతి తత్త్వములను, పురుషుడు (జీవుడు లేదా ఆత్మడు) మున్నగు విషయములను చర్చించి, ఆత్మడు, 'పురము' అను హృదయ గుహలో నుంపటం బట్టిపురుషునను నామమున వెలసియుం సకల బంధబద్ధుడైనాడు కాబట్టి ఆ బంధముల నుండి విడివడు జ్ఞానమును పొంది, జీవుడు ముక్తి లేదా మోక్షమునందునని నిరూపించినారు. జీవునితో వెరసి పంచ వింశతి తత్త్వములగును ఈ ఇరువదైదు తత్త్వముల కతీతమైన పరబ్రహ్మమే (ఆత్మయే) ఇరుదారవ తత్త్వము. దీనిని గుర్తించుటయే యోగము యొక్క లక్ష్యము.

చిత్తము యొక్క సత్త్వరజ స్తమోద్రేక క్షిప్తాద్యవస్థల గుణములను తెలియపరచి, ఏకాగ్రతగల్గిన చిత్తావస్థయే యోగమునకు సాధనమని వచించి, ఆ ఏకాగ్రత స్థిరమయినపుడే సాధకుడు స్థితప్రజ్ఞత్వము వహించి బ్రహ్మానంద సంధనుడగుటయే మోక్షమని రచయితగారు తెలిపినారు. యమ నియమాదులు యోగసాధకునకు మెట్టవలసిన ప్రథమ సోపానములని వివరించి, యోగ విఘ్నకారక వ్యాధి, మానసికాలసత, అవిరతి, అనవస్థితత్వము మొదలుగాగల వాని లక్షణములు, అణిమాద్యష్ట సిద్ధులు, అమనస్కము, అమనస్కయోగి ప్రవర్తనము మున్నగునవి సుగ్రాహ్యముగా వివరించినారు.

యోగాభ్యాసకుల కీ గ్రంథము మార్గదర్శకముగా నాచార్యుల వారు రచించినారనుట నిర్వివాదము

ఈ గ్రంథము నేకాగ్రతతో పఠించు వానికి "యోగ" ప్రయోజనము తెలియుటయే గాక, యోగము సాధింపనుత్సుకత కూడ జనించునని అస్మదభిప్రాయము. ఐనను ఏ చిన్న పనికైన మార్గదర్శకుడైన గురుడు లేనిది ఆ పని నెరవేరుట కష్టము కదా! అందుకే శ్రీ వీరరాఘవాచార్యులు గురువు యొక్క బోధన, మార్గదర్శకత్వము లేనిది యోగము సాధించుట అనుచితమేగాక ప్రమాదమనియు నొక్కి వక్కాణించిన విషయము పాఠకులు విస్మరింపజనదు

## మిత్ర సాహస్రి

మన కొండూరు వీరరాఘవాచార్యులు గారు తాత్త్విక రచనలే గాక లోకోపకారక "నీతి" సాహిత్యము సైతము రచించి, ప్రచురించినారు. అట్టి దీ మిత్ర సాహస్రి. అందలి నీతిని, శ్రీవారి పరోపకారకత్వమును కొంత చవిచూతుము.

మూడువందలేండ్లకు పూర్వుజుడైన వేమనయోగి తన కాలము నాటి సమాజమునందలి దొసగులను సరిదిద్దుటకై "ఆటవెలది" లనబడు చిన్నారి పద్య సముదాయము ద్వారా ఏ జాగృతిని ప్రబోధపరచినాడో, ఆ పథములోనే కొండూరు రాఘవ ఘనుడు తమ సమకాలిక సమాజమున నిద్రాణమైయున్న నీతిని—జ్ఞానమును మేల్కొల్పుటకై ఆటవెలదుల సాయమునే స్వీకరించినాడు ఆటవెలదుల యొక్క సుకుమార భావ భంగిమలతో సంఘమునందలి కుల, మత విభేదములను, ఆస్తికనాస్తికతలను, కలిమిలేముల అంతర్యమును,

చదువు సంస్కారములను, యోగ భోగ త్యాగములను మరియు అతిథులు, ఉత్ప్రేక్షోదంత్రము, సజ్జన దర్శనలు వంటి యనేక లౌకిక విషయములందలి గుణావగుణములే గాక, తాను యోగ దర్శి యగుటంజేసి షట్చక్ర వివరములను, జీవేశ్వర గుణ గణములను, సాంఖ్యాద్యమనస్క రహస్యములను పామరునికి సైతము తేటపడు భాషలో "మిత్ర సాహస్రి" పేర నొక ఉద్గ్రంథము రచించినారు. ప్రతి అటవెలదిచే తాను చెప్పబోవునది "విశ్వహిత చరిత్ర"మని చెప్పించి దానిని "వినరమిత్ర" యను సంబోధనామకుటమిడి జగ ద్రంగమున ప్రవేశపెట్టినాడు ఈ ఆటవెలదులు కాలానుగుణ్యము ననుసరించి, వేమననాటికన్న సంస్కారవంతులై యొప్పినవని అన వచ్చును. ఇట్లనుటచే వేమనగారిని కించపరచుట యెంత మాత్రము కాదని మనవి. సమాజము ప్రతిరంగమున నాటికి నేటికి మార్పు చెందుచుండుటయు, ఇకముందున కూడ మార్పుచెందుననుటయు, చారిత్రికులకు, కవులకు, రచయితలకు తెలియనిది కాదు. విశ్వభర్త యైన సహస్ర శీర్షుని ప్రతిశీర్షమున (ఫణమున) మణి ప్రకాశించునట్లు మిత్రసాహస్రిలోని ప్రతిశీర్షికయందేగాక ప్రతిపద్యమున, మకుటోపరి భాగముననొక విశిష్ట "నీతిమణి" ద్యోతకమగుచున్నది. ఈ సాహ స్రిలో పది శతకములు కలవు. ఒక్కొక్క శతకమును ఆంధ్రావని యొక్క నేటి పండితాగ్రగణ్యుల కొక్కొక్క శతకము చిరస్మృతిగా నంకిత మొనర్చబడినది. శతకమేగాని, సాహస్రికమే గాని లేదా శతాధిక పద్య ప్రబంధమేగాని, ఏదేని ఒకదేవునకో, వ్యక్తికో అంకిత మిచ్చుట సాంప్రదాయికముగా వచ్చుచున్న ఆచారము. కాని మన ఆచార్యుల వారు సంస్కరణాభిలషులు కదా! దీనిని క్రొత్త పంథాతో నడిపినారు. ఇది వీరి వినూత్న మార్గమున నడచినదని చెప్పవల యును.

ఏ పద్యముగాంచిన నందులోనొక జ్యోతిర్మయమణి ప్రకా శించునని పైన తెల్పబడినది, వాటినన్నింటిని నిట ప్రకాశింపజేయుట

సాధ్యపడదని మచ్చుకొకటి రెండు ఎత్తిచూపెదము "అతివల"ను గురించి లోకమున చులకనగా బలుకుట కలవాటుబడిన పురుషాధిక్య తను నిరసించుచు అతివను అబలగా దలంపవలదని, ఆ అబల యన బడెడు కాంతయే మోక్షదాయని అనగా ముక్తికాంత కదా! యని యొక పద్యమున నాచార్యులేమన్నారో తెలియుడు.

"ముక్తి పథము సాగ ముదిత విఘ్నంబను
పలు కధీరమతుల పట్ల నిజము,
ధీరమతికి ముక్తి తెరవు చూపును కాంత
విశ్వహిత చరిత్ర వినురమిత్ర"

ఇందు "ముక్తికాంత"యనబడునది అతివగాక పురుషుడా? అని పరంజ్యోతి స్వరూపిణి నుదహరించి మహిళల గౌరవమును పెంపు చేసినారు. అంతియే కాదు -

"ఆడుపెత్తనమున నణగారు కొంపయన్
పొల్లు మాట నేడు చెల్లదింత" అని వచించి, ఈ తన సమర్థనమున కింకొక పద్యమున,

"దేశమేలు వనిత తీర్పజాలదె యిల్లు"
అని మన భారతదేశ ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ గారి ప్రజ్ఞాపాటవ సామర్థ్యముల నుగ్గడించి, అబలలు సబలలని మగ మునగాండ్రకు బుద్ధి గరపినారు.

మన భారతదేశముననేగాక ప్రపంచమందెల్లెడల, ప్రజా మతమనబడు "వోటు" (Vote) పైననే ప్రభుత్వములు నేడు పాలింపబడుచున్నవి. ఆ వోటుకు గల విలువను నుగ్గడించుచు నొక పద్యమున——

"ఓటు కోటిసేయు హొన్నుల మూటరా" అని వచించి అట్టి విలువైన ఓటు యెవరికిచ్చిన మేలగునో? యనుచు;

"వోటు మంచివారి కొసగిన మేలవు"నని ప్రజానీకమునకు తెల్పినారు. ఇక;

"చదువు చదువటంచు చత్తురీకాలాన
సంస్కరింపలేని చదువదేల?"

సంస్కారము గలుపలేని చదువెంత నేర్చినను వ్యర్థమని, సంస్కారము గలవాడు విద్యాగంధము లేనివాడయ్యును విజ్ఞుడుగా పరిగణింపబడునని ధ్వనిపూర్వకముగ సూచించినాడు.

మతములను గూర్చి ఆచార్యులు - మతములు సమాజమును భిన్నవిభిన్న మార్గములం గొనిపోయి సాంఘికానైక్యతకు దోహదమొనగుచున్నవి. సమాజైక్యతకు భంగకారక మతములు సన్మతములు, సమ్మతములు కావని -

"మహికి మంచి కూర్చు మతము సమ్మతమురా" అని నిక్కచ్చిగా వచించినారు. ఇట మహి యన పెద్ద మట్టి రాశియైన భూమి మాత్రము కాదు. భూమిపైనుండెడి ప్రాణికోటి, విశేషించి మానవాళి యని అర్థము. మనుజులకు మంచి కూర్చునదియే సన్మతమని ఆచార్యుల హృదయము.

నేటికాలమున కొందఱు స్త్రీలు-పురుషులు-కొందఱు బాలురును తాము సాధించు పనులలో నిసుమంతయేని కష్టనిష్ఠురములు, మానావమానములు అడ్డువచ్చునంత మాత్రాన సహనముగోల్పోయి, ధైర్యము సడలి ఆత్మహత్య చేసికొనుట దిన, వార పత్రికలలో మనము చూచు

చునే ఉన్నాము అట్టివారిని గూర్చి ఆచార్యులవారు "చచ్చిమనుజు డేమి సాధింపగలడురా" అని బుద్ధి గఱపి, బ్రతికియున్ననే సాధింప గల కార్యములు కష్టానసహించియైనను సాధించి విజేతయగును గాని చచ్చిన పిదప నేమియుజేయజాలడని, ఆత్మహత్య వ్యర్థమగు ఉద్రేకమని బోధించినారు.

ఈ ప్రకారముగా ప్రతిపద్యమున నొక ఆణిముత్యము వంటి బోధ కలదు సహస్రమునందు సహస్రనీతులు కలవు. లోకోపకార నీత్యుక్తులేగాక పరతత్త్వచింతన కాస్పదములైన బోధోక్తులు మనసు నాకర్షించి హృదయ వికాసము నొనగూర్చునట్టి వనేకము కలవు. మచ్చున కొకటి రెండుదహరింతును.

బ్రహ్మమెచట కలడను ప్రశ్నమునకు సమాధానముగా;
''నువ్వులందు నున్న నూనెచందంబున' అని,
సామాన్యోపమానము నుదహరించి, నువ్వులలో నే మూల నూనియ యున్నదో తెలియజాలము కాని, వాటిని గానుగవేసి పిండి, పిప్పి చేసిననే గాని నూనె తెలియబడనట్లు ''విశ్వమందు వెలయు విశ్వే రుండు" అనగా విశ్వప్రాణికోటిలో నాత్మగా ఈశ్వరుడు వెలయు చున్నవాడు అని వివరించినారు మరొక పద్యమున—

''కంటి కగ్గపడక కలవెన్నో యనుభూతు
లట్టి వెల్ల నున్న యనుట తగునె", అనుభవించబడు బాధ
"మన కంటికి అగపడదు. అయినను దానిని పట్టి చూపలేకున్నను, అది లేదని అనగలమా? అటులే దేవుడు కనబడకున్నను లేడని అన గలమా? మనలో నెవ్వడే (ప్రాణము - ఆత్మయే) లేనిచో మనము లేము, మన విశ్వము లేదు. మనమున్నామంటె ఆ ప్రాణముండుట కదా! అట్టితరి మనమా ప్రాణమునుపట్టి చూపజాలుదుమా? చూపజా

## యోగ దర్శనము

బ్రహ్మర్షి యోగీంద్రచంద్ర శ్రీ వీరబ్రహ్మం గారి చరిత్ర విరచనానంతరము, కొంతకాలము శాస్త్రీయమార్గమున యోగ మభ్య సించి, ద్రష్టయై వెలయుటంజేసి కానగును, ఏతత్ యౌగికస్వాను భవ పరిశీలన ఫలముగా "యోగదర్శన" మను నొక గ్రంథమును వ్రాసినారు. అది క్రీ శ. 1977వ సంవత్సరము ముద్రితమై లోక మున ప్రకాశమొందినది.

యోగ దర్శనమనగా "యోగము"ను సాధించి, దాని యొక్క జ్ఞానము నెరుంగుటయని యర్థము. "యుజిర్ - యోగే" ధాతూత్పన్న పదము "యోగము" అని, కలయిక లేదా కూడట లేదా ఐక్యత అని, పై గ్రంథమున ఆచార్యులు తెల్పినారు. జీవుడు - ఈశ్వరునితో (ఆత్మతో) కలియుటయే యోగమనబడును. బ్రహ్మముతో కలియ గల్గినవాడే యోగి. బ్రహ్మాంశజుడైన జీవుడు బ్రహ్మముతో సంయోగ మొంద నేల? ఎందుకనగా జీవుడు బ్రహ్మభాగుడే కదా! అను ప్రశ్నకు సమాధానముగా "జీవుడు మాయాబద్ధుడై మోహాంధ తమము నజిక్కి సత్-అసత్ విషయము నెరుంగక నానావిధ జన్మము లెత్తుచు, తనను తానెఱుగక బాధపడుచున్నాడు. ఆ జనన మరణ భ్రమణము నుండి నివృత్తి పొందుటకై యోగమవసరము" అని కుండలి నీయోగాదులను మన దర్శనాచార్యులు వివరించినారు జనన మరణ పాశబంధములను త్రుంచి జీవుడు సర్వదా బ్రహ్మానంద మగ్నుడైననే కాని ఆనందము లేదు. అందుకై జీవునకు సాధనము లావశ్యకములు. ఏ పనియైనను సాధనములు లేనిది ఒనకూడదు కదా! అందుకై మనోవాక్కాయ కర్మలనెడి త్రికరణముల చాంచల్యము నణచి జీవుడు (మనుజుడు) నిశ్చలభావమున కుండలీ యోగమును

సాధించి ముక్తుకు కాగల్గురని శ్రీ వీరరాఘవాచార్యులీ యోగదర్శన గ్రంథారంభోపక్రమమున విశదపరచినారు.

ఉపక్రమానంతరము జీవేశ్వర వివేక శీర్షికతో యోగవిచార మారంభింప బడినది. ఇందు ''జీవుడు-ఈశ్వరుడు" అను వా పరిజ్ఞానమును చర్చించుచు ఈశ్వరుడు క్లేశకర్మ విపాకాశయాది గుణరహితుడని, జీవుడు క్లేశకర్మ విపాకాశయాది గుణసహితుడై అవిద్య (మాయ)లో బంధింప బడిన వాడని తెలియ పరచి, ఈశ్వరుడు సర్వజ్ఞుడు, జీవుడు అల్పజ్ఞుడని జీవేశ్వర వివేచనము అతి సులభముగా నొనరించినారు. తత్పరి ఆచార్యులుగారు జీవేశ్వర సంయోగమును, తత్ప్రయోజనము వ్యక్తపరచినారు.

'యోగ' మనునది "చిత్తవృత్తి నిరోధః" అన్న పతంజలి యోగ శాస్త్రము ననుసరించి అంతఃకరణములోని చిత్తమును నిగ్రహించుటయగును. యోగములన్నింటిలో నిది "రాజయోగము" వంటిదని చెప్పబడును. రాజయోగమనగా మానవుడు భార్యాపుత్రాశితో సాంసారిక జీవనము నలుపుచు, సంసార బంధములో ముడివడక, తన విధ్యుక్త కర్తవ్యములు నెరవేర్చుచు, కుండలినీయోగము ద్వారా సోహంచిత "హంస" నధిగమించి, త్రివేణీ సంగమమనెడి భృకుటిస్థ పరమాత్మను-పరంజ్యోతిని - దర్శించుట యగును. అటువంటి సాధకుడే రాజయోగి. ఏతద్రాజయోగ సాధనము సర్వసంగ త్యాగియై చేయుట సులభము. కాని సంసారము జరుపుచు సాంసారికమోహ బంధములకు లోనుగాక, తన కర్తవ్యమును మాత్రము చేయు రాజయోగము అన్నింటిలో శ్రేష్ఠమైనదని విజ్ఞులు వచింతురు. అట్టి యోగమున తపించిన శరీరము జరామృత్యు రోగరహితమై, తప్త కాంచనము వలె పరిశుద్ధమగును. పరిశుద్ధతను

జరిగిన లోహ్రాదపమును సీరుగా ద్రావి యోగము యొక్క మహత్వ మును చాటినారు.

ఇట్టి మహా యోగీంద్రుల జీవిత చరిత్రములో ప్రధాన ఘట్టము లను కొన్నింటిని స్వీకరించి సంక్షిప్తముగా వారి రచనా విశేషములగు తత్త్వములు గోవింద వాక్యములు మున్నగు వాని భావములను మన కొండూరు వీరరాఘవాచార్యులు విలిఖించి, సమాజమున నిద్రాణమై యున్న భక్తి జ్ఞాన-వైరాగ్య, తత్త్వయోగములను మేల్కొల్పినారు. ఆచార్యుల వారి హృదయము కూడ యిట్టి గుణ గణ సమేతనమగు టంజేసి వీరి రచనలందెల్లెడల, లోకోన్నత విషయ విజ్ఞానమే నిండి యుండి మానవాభ్యుదయము నాశించునదియే ఈ "మన గురుదేవుని" చరిత్రమని నొక్కి వక్కాణించుచున్నాము.

## ఆచార్యుల కావ్య సృష్టి

ఆచార్యుల జీవితమంతయు గ్రంథరచనమునకే అంకితమైనది. వీరి రచనమంత గద్య పద్య గేయములతో నిండి యున్నది. కొందరు గద్యమునకు, కొందరు పద్యమునకు కొందరు గేయమున ప్రసిద్ధు లయితె వీరీయన్నింటిలోను అంటె వేసినవారు.

తోరణం :- వివిధ ఖండికల సంకలనముగా పేరు "తోరణ" మను కావ్యమును పద్యములో, గద్యములో రచించినారు. మహా రచ యితలయిన సర్వశ్రీ రాయప్రోలు, దువ్వూరి, విశ్వనాథ, నాయని మరియు దేవులపల్లి వంటి ప్రముఖులచే సాగిన నవ్యకవిత ఆచార్యుల వారితో పూర్ణరూపము దాల్చినదనవచ్చును. గత 2, 3 దశాబ్దములు ప్రాయికంగా ఆంధ్ర వాఙ్మయమంతనిండి మెరుగులుతీర్చుచు వచ్చిన భావ కవిత్వము. ఈ తోరణంలో పరాకాష్ఠనందినదని చెప్ప వచ్చును. ఆచార్యులవారి ఉపనిషత్సంస్కార పాండిత్య వాఙ్మయ

మంత తోరణములో ద్యోతకమౌచుండును. ఉత్తమఖండ కావ్యాల్లో నిస్సంశయముగ నొకటియని చెప్పక తప్పదు.

అమరావతి :- తోరణము వంటి మరొక కావ్యము "అమరావతి". ఇందు ఆచార్యుల వారు అచటి పూర్వపు శిల్ప సౌందర్యమును వర్ణించుచు మరియు సద్దాని వినాశనమునకు పరితపించుచు ఆవేదనతో వ్రాసిన కావ్య ఖండము. అమరావతి శిల్పమును గూర్చి గ్రంథకర్తగారి హృదయము నీక్రింది పద్యమున చూడగలము.

"అద్ది కారుణ్యమూర్తి దివ్యాంఘ్రి దివ్య - పూజకెత్తిన
రత్న నీరాజనమ్ము
అది జగచ్ఛాంతి దూత దివ్యావతారు నర్చనము చేయ
శిల్ప పుష్పాంజలి పుటి"

అని పల్కిన మాటలు పరమ సత్యాలు. కావ్యమును కవిని గూర్చి కృష్ణాపత్రిక ఏమన్నదో చూడుడు.

"నవ్యాంధ్ర సాహిత్య సంస్థానాస్థానంలో సరస్వతీ సింహాసనానికి సమీపంగా ఒక ప్రముఖ స్థానం అలంకరింపదగ్గ కావ్య శిల్పం అమరావతి. గ్రంథం విద్వత్సంస్తవనీయమైన ఈయన కవితావేశానికి పూర్వ సంస్కారంతోపాటు అభిజన గౌరవం కూడ కారణమైనది. ఈయన ప్రత్యణువులోను వైదిక శిల్పర్షి సంప్రదాయ ప్రభావం అనేకశః గోచరిస్తుంది" అని పత్రికచే ప్రస్తుతింపబడినది.

ప్రాచీనాంధ్ర శిల్ప నాగరికతా వైభవాన్ని ప్రదర్శించి ఆంధ్ర హృదయాలను తేజపరచి సర్వధర్మానుష్ఠాన తత్పరులుగా చేయగలదీకావ్యమని" ప్రశంసలనందినదీ అమరావతి.

ఇక రాఘవాచార్యుల తత్త్వ జ్ఞాన విషయక "యోగ దర్శనము" గూర్చి తెలిసికొందము.

# మన గురుదేవుడు

శ్రీ కొండూరు వారి విరచిత సాహిత్యములో ప్రచురణక్రమ మును బట్టి యిట పొందుపరుప యత్నించనైనది. వీరి శిల్పదర్శనా నంతరము మరొక రచనము శ్రీ వీరబ్రహ్మ యోగీంద్రుల వారి చరిత్రము,

చారిత్రక ప్రబంధ రచనలలో చతుర్విధ నాయకులుందురని శాస్త్రము చెప్పుచున్నది. ధీరోదాత్త - ధీరోద్ధత - ధీర శాంత - ధీరలలితులనబడు చతుర్విధ నాయకులలో నీ చరిత్రమున ధీరో దాత్త మహాయోగీశ్వరులు నాయకులుగా గలరు. నాయకులు యోగీ శ్వరులగుటచే శాస్త్రసమ్మతముకన్న మిన్నయని చెప్పవచ్చును.

యోగద్రష్టలైన వారే యోగీశ్వరులు. శిల సమాధౌ ధాతువు నుండి శిల్ప శబ్దముత్పన్నమై సమాధ్యవస్థను కల్గించునని శిల్పదర్శన మున తెలిసికొనినాము అట్టి సమాధ్యవస్థను యోగమని కూడ విజ్ఞులు వచించినారు "యుజిర్ - యోగే" ధాతుభవమైనది యోగశబ్దము. యోగమనగా "కలయిక". దేనితో, దేనిలో కలయుట అనునది యొక ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానముగా పతంజల్యాది యోగ శాస్త్ర కర్తలు "ప్రాణికోటిలో సర్వోత్కృష్టుడనబడు మనుజుడు తన అంత రంగమున వెలసియున్న 'ఆత్మ'తో కలయుట"యని యోగశబ్దమున కర్థము చెప్పినారు. ఈ కలయికయే యోగము. యోగము జీవునకు మోక్షప్రదాయక సాధనము. జీవన్ముక్తి కొఱకే కదా మన శ్రుత్యాగమ వేద, వేదాంతములు ఘోషించుచున్నవి. అట్టి మోక్షప్రద జ్ఞానమును మానవున కుపదేశించి జన్మరాహిత్య మార్గము నవలంబింపజేయువారే యోగులు. పరమేశ్వరుడే ఒక రూపము దాల్చి లోకమున నవత రించుచుండునని మన భారతీయ సారస్వతపు పుటల, తిరుగవేసినచో

మన కనేక సాక్ష్యములు కనబడును. గీతలో శ్రీకృష్ణ భగవానుడీ యంశమునే ప్రబోధించినాడు. ఇట్లవతార పురుష యోగీశ్వరు లప్పుడప్పుడు లోకోద్ధరణ మొనరింతురని చరిత్రలు కలవు.

మహనీయులైన యోగులు లోకమున నరుదుగా నుద్భవింతురు. అట్టివారలే శంకర రామానుజాచార్యశ్రేష్ఠ సంయములు, పరతత్త్వ మును బోధించి మానవ లోకమును సంస్కరించినారు. కర్ణాటకమున బసవేశ్వర - మౌనీ(నే)శ్వరుల వంటి వారుద్భవించి సమాజోద్ధరణ మొనర్చిన మహాయోగులు. ఆంధ్రదేశమునను శ్రీ వేమనార్య - వీర బ్రహ్మంగారులు సుప్రసిద్ధ యోగిపుంగవులు.

"మన గురుదేవుడు" అనగా శ్రీ విరాడీశ్వర బ్రహ్మేంద్ర స్వాములు దాదాపు ఇప్పటికి మూడువందలేండ్లకు పూర్వము (కలి : 4770/క్రి. శ. 1670)న నవతరించినట్లు చారిత్రకుల అంచన. ఈ మహనీయమూర్తి సమకాలీన జనోద్ధరణకై వివిధ మార్గములవలం బించి కాలజ్ఞానము ద్వార, యోగము ద్వార, సంస్కరణల ద్వార, భక్తి బోధన ధ్వార, కుల, మత రహిత సమానత ద్వార, వేదాం తము ద్వార పరివర్తనము చేసి, చేయించి ప్రజను సత్పథమున నడి పించిన మహాజ్ఞాని. ఉపనిషత్తుల యొక్కయు, బ్రహ్మ సూత్రముల యొక్కయు, భగవద్గీతల యొక్కయు - అనగా ప్రస్థానత్రయ సారాంశమును పామర జనము నుండి పండిత ప్రకాండుల వరకవ గాహనమగునట్లు తేట తెనుగుభాషలో ఆత్మతత్త్వమగు వేదాంతమును సుబోధ పరచినారు మహావాక్యార్థమును అందరకు తెలియుటకై "నేనే బ్రహ్మమురా" అని "అహం బ్రహ్మాస్మి"ని బోధించిన ఈ వీర యోగీంద్రులు లోకమునకు ''గురువు"గా ప్రసిద్ధినందినారు. ఆత్మ ద్రష్టయై అష్టాంగ యోగము లభ్యసించిన మహాయోగివర్యులు గాన

ఓం నమో విశ్వకర్మణే

# దర్శనాచార్య
# శ్రీ కొండూరు సాహిత్య జీవిత చరిత్ర

విశ్వ స్రష్టచే వెలయింపబడిన ఈ విశ్వమండలి ప్రాణి కోటిలో మానవ జన్మ మత్యుత్కృష్టమైనదని శాస్త్రము లుగ్గడించినవి. అట్టి మానవ జన్మము కల్గుట వాస్తవముగ సకల ప్రాణులలో దుర్లభమేగాక, ఆ మానవునకు ముముక్షత్వ జ్ఞానాభిలాష కలుగుట ఇంక దుర్లభమని తోచును ఇట్టి అలభ్యములు లభించుట ఆ మానవుని పూర్వకృత పుణ్యఫలమేయని అనవలయును. దైవానుగ్రహము లేనిది అది ప్రాప్తించదని నొక్కివక్కాణింపవచ్చును. భగవదను గ్రహముచే జనించిన మానవులెందరీభువిపై లేరు? ఉన్నను ఆ యందరిలో వారి జన్మకారకుడైన సృష్టికర్తను గూర్చి ఆలోచించు వారెందరు? ఏ నూటికో కోటికో యొకరిద్దరుండి యుందురనుట మతిశయముకాదు. అట్టి వారిలో సైతము సృష్టిగూర్చి, సృష్టికర్తను గూర్చి, సృష్టి కర్మమును గూర్చి మరియు తమను, తమ జీవిత ధ్యేయమును, తమ కర్తవ్యముమ గూర్చి ఆలోచింపగల వారెందరు? అతి స్వల్ప సంఖ్య అనవలయును. ఇట్టి స్వల్ప సంఖ్యలో పరిగణింపబడెడు వారిలో గూడ వారార్జించిన విజ్ఞానమును లోకమునకు పంచిపెట్టి లోకము నుద్ధరింప నిచ్చగల వారెందరు? చాల అరుదు. కావుననే అట్టివారిని నూటి కొక్కరనుటకంటె కోటి కొక్కరని అనవలసియుండును. అట్టి అరుదైన వారిలో "పరోపకారార్ధ మిదం శరీరం" బనియేగాక "ఇదం జ్ఞాన" మను బుద్ధిగల ఋషి తుల్యులును, ఋక్ - సామ - యజురాధర్వాద్యాగమములను దర్శించిన దర్శనాచార్యులు బ్రహ్మశ్రీ డా॥ కొండూరు వీరరాఘవాచార్య కళాప్రపూర్ణ లీనాడాంధ్రావనిలో పండిత ప్రకాండ ప్రద్యోతనుడుగా వెలుగుచున్నారనిన సత్యదూరముకాదు. ఇంతటి అత్యున్నత, మహా